*Issued—28-7-1954*




# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## THURSDAY, 26th NOVEMBER 1953

### VOLUME 1—No. 3




*CONTENTS*



PRINTED FOR ANDHRA GOVERNMENT PRESS
BY GORDON PRESS, GUNTUR-2.
1954

PRICE, 6 *annas*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

**THURSDAY, 26th November, 1953.**

The House met in the Assembly Chamber, Kurnool, at ten of the clock, Mr. Speaker (the Hon. Sri N. Venkataramaiya) in the Chair.

[*Note:*—(*) **An asterisk at the commencement of a speech indicates correction by the Member.**]

## PANEL OF CHAIRMEN.

Mr. SPEAKER:—

ఇప్పుడు Panel of Chairmen ను నామినేట్ చేయవలసియుంటుంది. ఈ క్రింది నలుగురి సభ్యులను panel లో వేయడమైనది.

(1) శ్రీ టి. లక్ష్మీనారాయణ రెడ్డి (1) Sri T. Lakshminarayana Reddi.
(2) శ్రీ జి. నాగభూషణం (2) Sri G. Nagabhushanam.
(3) శ్రీ యన్. వి. రామారావు (3) Sri N. V. Rama Rao.
(4) శ్రీరొక్కం లక్ష్మీనరసింహం దొర (4) Sri R. Lakshminarasimham Dora.

మొన్నసాయంత్రం మన సభకు గవర్నరుగారు అడ్రసు ఇచ్చారనే విషయం సభ్యులందరికి తెలిసిన విషయమే. ఆ అడ్రసును గవర్నరుగారు సభలో చదివారు, మరియు ఆ అడ్రసుయొక్క కాపీలుకూడా సభ్యులందరికి ఒక్కొక్కరికి ఒక్కొక కాపీ ఇప్పుడు ఇచ్చి ఉన్నాము. గవర్నరుగారి అడ్రసుమీద, ఈవేళ చర్చ జరుగుతుందని చెప్పాను. ఇప్పుడు వై. ఆదినారాయణ రెడ్డిగారు ఈ క్రింది Motion of Thanks ను పంపించారు. అది సభవారి ఎదుట ఉన్నది.

"That a humble Address be presented to His Excellency the Governor as follows :—

> "May it please Your Excellency, We, the Members of the Andhra Legislative Assembly beg leave to thank Your Excellency for the Address delivered to the House on the 24th November, 1953."

మనము అనుసరించబోయే procedure ఈ మాదిరిగా చేస్తామని అనుకొన్నాను. ఇప్పుడు 10 గంటల నుంచి 1 గంటవరకు ఈ గవర్నరు అడ్రసుమీద సాధారణ చర్చ ఉంటుంది. తరువాత 2 గంటల నుంచి సవరణలు తీసుకోబడును. వీటివిషయమై 12 గంటలకు పార్టీనాయకులు నేను కలిసి decide చేస్తాము. ఆ సవరణలన్నీ పరిచూచుకొని వాటిని సాయంత్రం ప్రతిపాదించడం, ఆటు తరువాత వాటిమీద రేపు సాయంత్రం వరకు చర్చ జరుగుతుంది. రేపు సాయంత్రం ఈ చర్చ ముగించబడును.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :—నేను ఒక point of order ను raise చేస్తున్నాను. అసెంబ్లీ ఎప్పుడుకూడాను ప్రశ్నలతో ప్రారంభించవలసిన

అవసరమున్నది. ప్రశ్నలు లేకుండా శాసనసభ ప్రారంభించడం సాంప్రదాయానికి విరుద్ధమనుకొంటాను. ఇప్పుడు ప్రశ్నలు తీసుకోకుండానే సభను ప్రారంభించారు. కనుక, అసలు ప్రశ్నలు ఏవి రాలేదా? వచ్చివుంటే వాటిని waive చేశారా, లేక ఇంకొక procedure ను ఏమైన అనుసరిస్తున్నారా అని అడుగుచున్నాను.

Mr. SPEAKER:—ఇదివరకు సభ్యులు కొన్ని ప్రశ్నలు పంపించిఉన్నారు. వాటికి సమాధానముల కొరకు concerned departments కు పంపించిఉన్నాము. వాటికి ఇంకను సమాధానములు రాలేదు. వచ్చిన వెంటనే వాటిని తీసుకుంటాము.

## II. MOTIONS

### PRIVILEGE MOTIONS.

Sri K. KRISHNA RAO:—On a point of order, Sir, నేను రెండు Privilege Motions పంపించాను. Privilege Motions కు మిగత అన్నిటికన్న precedence ఇవ్వవలసి యుంటుంది గనుక వాటిని తీసుకోవలసిందని చెప్పుచున్నాను. నా రెండు Privilege Motions లో మొదటిది, ఈ శాసనసభకు స్పీకరు అనేటువంటి అతను, శాసనసభ ఉన్నప్పటికిని, dissolve అయినప్పటికిని, అక్టోబరు మొదటి తేదీనుండి ఉండవలసిందని, ఆ స్పీకరును ఎన్నుకోవడమనేది తరువాత జరిగినప్పటికిని, 180 Article ప్రకారం, గవర్నరుగారు ఒకరిని నామినేట్ చేయడం జరిగిఉండవలసిందని పంపించినటువంటి Privilege Motion. దీన్ని గురించి ఏమిజరిగింది? అంతకుముందు వచ్చినటువంటి ప్రశ్నలు, దరిమిలా వచ్చినటువంటి ప్రశ్నలు, admit చేసుకోనటువంటివాటి విషయం, స్పీకరు లేనందువలన right of questioning సభ్యులు కోలుపోవడం జరిగింది. కాని ఈవేళ కార్యక్రమము ప్రశ్నలు అనేటటువంటిది లేకుండా ఏర్పాటుచేయబడింది. ఇది సభ్యులయొక్క హక్కులకు భంగకరమని, ఈ సభకు, సభ్యులకు ఉండేటటువంటి గౌరవాలకు లోపమని మనవిచేస్తున్నాను. గవర్నరుగారు ఎందుకు అక్టోబరు మొదటి తేదీనే స్పీకరును నామినేట్ చేసియుండకూడదని అడుగుచున్నాను. అందువల్ల ఈ విషయాన్ని Privileges Committee కి refer చేయాలనేటటువంటిది. ఈ Privilege Motion. రెండవది.......

Mr. SPEAKER:—ఈ Privilege Motions గురించి నిన్న నోటీసు ఇచ్చారు. ఒకటి ఏమిటంటే......

Sri K. KRISHNA RAO:—అంతకుముందే ఇచ్చాను.

Mr. SPEAKER:—ఇదివరకు స్పీకరును appoint చేయడంలో ఆలస్యం అయిందని అందులో privilege involve అయిఉన్నదని ఇచ్చిన Motion కు, ఇదివరకు, అనగా మొన్నటిరోజున టెంపరరీగా preside చేసినటువంటి స్పీకరు శ్రీ N. V. L. నరసింహారావు గారు జవాబు చెప్పారు. అందువల్ల, దాని విషయం చెప్పేది ఏమిలేదు. రెండవది ప్రగడ కోటయ్యగారి ఆరోగ్యమునుగురించి.

Sri K. KRISHNA RAO:—ఆ విషయాన్ని Privileges Committee కి refer చేయాలనేగాని, ఒకరు దానికి జవాబు ఇచ్చివుండవలసిందని కాదు నా అభిప్రాయం. ఇది Constitution లో ఉండేటటువంటి హక్కు. దీనిని ఎవరుకూడా రద్దుచేయజాలరు. శాసనసభ ఉన్నా, లేక dissolve అయినాకూడా Speaker అనే అటువంటి ఒకరు సభ్యుల

యొక్క అవసరాలకొరకు ఉండాలి అనేటటువంటిది ఇది. అసెంబ్లీ జరుగుతూఉంటేనే స్పీకరు ఉండవలసిందని కాదు. స్పీకరు ఎప్పుడూ సభ్యులయొక్క హక్కులను కాపాడ వలసియుంటుంది. దాన్నిగురించి Temporary Speaker జవాబు ఇవ్వడమనేది వేరే విషయము. కనుక అది ఈ సభముందర చర్చజరిపి Privileges Committee కి refer చేయాలని కోరుచున్నాను.

Sri C. V. K. RAO:—On a point of order. నిన్న నేను రెండు Privilege Motions ఇచ్చాను. ఒకటి, ఈ అసెంబ్లీ సభ్యుడు కె. పట్టాభిరామయ్యగారిని గురించి, రెండవది ప్రగడ కోటయ్యగారి అరెస్టును గురించి.

Mr. SPEAKER:—నేను ఒక Privilege Motion ను గురించి మాట్లాడుతూ ఉండేటప్పుడు మీరు ఇంకో Privilege Motion గురించి మాట్లాడితే ఏమి బాగుంటుంది.

Sri T. NAGI REDDI:—అధ్యక్షా, క్రిష్ణారావుగారు చేసినటువంటి Privilege Motion చాలాప్రాముఖ్యమైనటువంటిది అనేవిషయాన్ని జ్ఞాపకముంచుకోవలెను. శాసన సభ ఎన్నికలు అయిన తర్వాత, వెంటనే ఒక స్పీకరును nominate చేయడమనేది పార్లమెంటరీ సాంప్రదాయము. ఇంతకుముందు మదరాసులోగూడా కొత్తగా ఎన్నికలు జరిగిన తరువాత, గవర్నరుగారు త్వరగా ఒక స్పీకరును నామినేట్ చేయడం శాసనసభ సమావేశమైనవెంటనే, ఆనాడే, వారిప్రశ్నలకు సమాధానము లివ్వడము జరిగింది. ఇది శాసనసభయొక్క సామాన్యసాంప్రదాయము, సభ్యులయొక్క సామాన్యప్రాథమిక హక్కు గూడాను. ఈ ప్రాథమిక హక్కును గుర్తించినటువంటి ప్రభుత్వము ఈ ప్రాథమికహక్కును హరించివేసిందని చెప్పవలసియున్నది. ఇది చాలాప్రమాదకరమైనటువంటి పరిస్థితి. ఈ పరిస్థితి ఏ విధంగా ఏర్పడింది, ఎందుకు ఏర్పడింది ? ప్రభుత్వము స్పీకరుగా ఒకరిని నామినేట్ చేయుటకు వీలులేకనా, లేక చేతగాకనా లేక అనవసరమనుకొనియా అని అడుగుచున్నాను. ఈ విధంగా ప్రభుత్వము సభ్యులయొక్క ప్రజలయొక్క హక్కును హరించివేసిందనే చెప్పవలసి యున్నది. లేకపోయినట్లైయితే, ఈ నాడు అసెంబ్లీలో ఎందుకు ప్రశ్నలు తీసుకోలేదు ? ఏ అసెంబ్లీకూడా ఒక దినము కూర్చున్నప్పటికినీ కూడా, ప్రశ్నోత్తరములు లేకుండా ఉండదు. మన అసెంబ్లీయే ఈ విధంగాఉంటున్నది. లేకపోయినట్లైతే ఈ శాసనసభ, ఈ మంత్రివర్గము ఏర్పడి దాదాపు రెండునెలలు కావచ్చినప్పటికి కూడ, ఎందుకు ఒక స్పీకరును నామినేట్ చేయడానికి వీలులేకుండా పోయింది ? ఇది సభ్యులయొక్క హక్కును హరించివేయడమే తప్ప మరేమీకాదు. కనుక ఈ విషయము Privileges Committee కి తప్పక పోవలసియుంటుంది. ఆవిధంగా సభ్యులయొక్క హక్కులను గౌరవిస్తారని ఆశిస్తున్నాను.

Sri L. LAKSHMANA DAS:— On a point of information, Sir. 10-10 a.m.
మొట్టమొదటి సమావేశము జరుగునప్పుడు యీ ప్రశ్నల విషయము లేదనే సంగతి నాగిరెడ్డి గారికి తెలియదు అని అనుకుంటున్నాను. మనము మదరాసులో మొట్టమొదటి సారిగా శాసనసభా సమావేశమైనప్పుడు గవర్నరు Speech మీద discussion జరిగినప్పుడుకూడా యీ ప్రశ్నలు అనేదిలేదని నేను తెలియజేస్తున్నాను.

Sri C. V. K. RAO:—ఈ విషయము రూల్సు ప్రకారము మొట్టమొదట గవర్నరు ఉపన్యాసంపై చర్చతప్ప మొదట ప్రశ్నోత్తరాలు తీసుకోకూడదు అనేది లేదు.

మనకార్యక్రమములో మొదట గంట ప్రశ్నలు, అటు తరువాత యితరవిషయములు తెచ్చే అధికారము అధ్యక్షులకు ఉన్నది. అంతకుముందే యేదో అలవాటునుబట్టి జరగాలి అనే విషయాన్ని అటుంచి రూల్సుప్రకారము ఆచరణలోపెట్టాలని నామనవి.

Sri PILLALAMARRI VENKATESWARLU:—గవర్నరు ఎడ్రసుమీద చర్చచేసేముందు ప్రశ్నలు ఉన్నవా? లేవా? అనేది సమస్యగాదు. అసలు (తాత్కాలిక అధ్యక్షుని నియామకం) Temporary Speaker appointment జరుగలేదు. మేము ప్రశ్నలు పంపిస్తే Speaker గారు వాటినిచూసి డిపార్టుమెంట్సుకు పంపించవలసియున్నది. టెంపరరీ స్పీకరు నియమింపబడకపోవుటవల్ల యీ ప్రశ్నలను సరిచూచేవారు యెవ్వరూ లేకపోయినారు. Time లేనందున సమాధానాలు రాలేదుఅంటున్నారు. అంటే departments అంత చక్కగా పనిచేస్తున్నందువల్లనే మా ప్రశ్నలకు సమాధానము వచ్చివుండక పోవచ్చు. ఐనప్పటికి temporary appointment కు దీనికి లంకెపెట్టడములేదని నేను మనవి చేస్తున్నాను. ఆలస్యములేకుండా ప్రశ్నలు పంపించి departments నుంచి జవాబు రప్పించే అవకాశము లేకపోయింది. Speaker యీ ప్రశ్నలను చూసి డిపార్టుమెంటుకు పంపాలి. అది జరగలేదు. అందువల్ల యీ పనిఅంతా యిప్పుడు జరుగవలసివచ్చింది. ఈ పనిఅంతయు సభ్యుల హక్కులకు సంబంధించినది కాబట్టి సభ్యుల హక్కులు భంగపరుపబడ్డాయి. అందువల్ల నేనుచెప్పేదియేమిటంటే ఒక Temporary Speaker appointment చేయబడ్డప్పుడు, తరువాత Permanent Speaker appointment అయ్యేవరకు Temporary Speaker, పర్మనెంటు స్పీకరు పనులు చేయవలసియుంటుంది. సకాలంలో Temporary Speaker ను నియమించకపోవుట వల్ల యీ పనులు జరిగే అవకాశం లేకపోయింది. అందువల్ల మేము పంపించిన ప్రశ్నలు డిపార్టుమెంట్సుకు పంపకుండా అలాగే వుండిపోయినవి. ఈ విధంగా సభ్యుల హక్కులు భంగపడినాయి. ఈ పని తాత్కాలిక అధ్యక్షుని వెనువెంటనే నియమించివుంటే యీ పాటికి మాప్రశ్నలకు సమాధానాలువచ్చి ఎజెండాలోకి వచ్చివుండేవి. దీనికి బాధ్యత ప్రభుత్వముమీద, గవర్నరుమీద వున్నది. సభ్యులకు యీ అవకాశం లేకుండా చేసినందువల్ల సభ్యులయొక్క హక్కులు భంగపరిచారు. కనుక ఈ విషయము ప్రివిలేజెస్ క్రిందకు వస్తుంది. కాబట్టి యిది ప్రివిలేజెస్ కమిటీ నోటీసుకు తీసుకుపోవాలని నా మనవి.

The Hon. Sri T. PRAKASAM:—అధ్యక్షా! ఈ మోషనును move చేయదంతోటే మీరు జవాబుచెప్పారు. ఆవిషయం తీర్మానముచేశారని మీరు జవాబుచెప్పారు. అయితే అది తీర్మానంక్రిందచూచుకుంటే మరల మొట్టమొదట ఈ ప్రశ్న తీసుకునివచ్చిన కృష్ణారావుగారే మీకు విజ్ఞప్తిచేస్తున్నారు. ఏదిఅయినప్పటికినికూడా ఇప్పుడు విచారించవలసిన సంగతి అదికాదు. ఇవ్వాళ ఎజెండాలో Temporary Speaker ను appoint చేశారా? లేదా? అనే point మీద ఏ విధంగాను ఆలోచించటానికి ఇప్పుడు అవకాశం ఏమీలేదు. Temporary Speaker వచ్చినతరువాతనే, యీ సంగతులు అన్నీ ఆలోచనలోకి వస్తున్నవి కాని ఏ అరాచకము చేయలేదుకనుక మాకు హక్కుపోయింది, ప్రపంచమంతా ఆగిపోయింది అని చెప్పడముకూడా జరుగుతున్నది.

Sri T. NAGI REDDI:—అవును. ప్రపంచమంతా మునిగిపోయింది. అసెంబ్లీకూడా పోయింది.

The Hon. Sri T. PRAKASAM:—ప్రపంచం ఆగిపోలేదు. అసెంబ్లీకూడా ఆగిపోలేదు. ఇవ్వాళ అసెంబ్లీ చాలా ఉద్రేకంతోనే పనిచేస్తున్నది. ఇవ్వాళ ఎసెంబ్లీలో మీరందరూ చేస్తున్న ప్రయత్నాలలోనే కనబడుతున్నది. ఏవో points of order లు అని privilege motions అని, అడ్డముపెట్టి ఎసెంబ్లీ కార్యక్రమము జరుగకుండాజేసే ప్రయత్నాలు కనబడుతున్నవి. Points of order లు privilege motions అంటే ఏమిటో నాకు తెలుసు, మీకు తెలుసు. అందుచేత యివన్నీ వాటికి అడ్డం పెట్టటముఎందుకు? ఇవాళ Temporary Speaker appointment ను గురించి, సభ్యులయొక్క హక్కులు భంగపడి పోయినవని privilege motions తెచ్చారు. ఇవన్నీకూడ Privilege motions క్రిందకు వచ్చినను, రాకపోయినను వాటినిగూర్చి చెప్పటము పనికిరాదు. మీరు చెప్పినట్లుగా Temporary Speaker ను గురించి వారు మాట్లాడవలసి వచ్చినప్పుడు, అప్పుడు యీ ఆక్షేపణ పెట్టుకోలేదు. Temporary Speaker ఉన్నప్పుడు అక్కడ ఊరికే మాట్లాడి Temporary Speaker వెళ్ళినతరువాత ఈ ప్రశ్నల విషయము తెస్తున్నారు. అసలు ఈరోజున ఎజెండాలో Temporary Speaker appointment ను గురించి ఉన్నదా? లేదా? అని ఆలోచించకుండా యివియేవో క్రొత్తవిషయాలు తెస్తున్నారు.

Sri T. NAGI REDDI:—On a point of personal explanation, Sir...

The Hon. Sri T. PRAKASAM:—నేను లేచి మాట్లాడేటప్పుడు నన్ను మాట్లాడనివ్వకుండా ప్రతిదానికి అడ్డమువస్తూవుంటే ఎట్లాగు? వారినే మాట్లాడనివ్వండి. నేను కూర్చుంటాను.

Mr. SPEAKER:—ఈ విషయములో Temporary Speaker ruling యిచ్చారని చెప్పియున్నాను. ఇక దానిమీద further discussion ఆపివేశాను.

Sri T. NAGI REDDI:—Temporary Speaker ఎదుట ఈ విషయము discuss చేయబడలేదు. ఎందుకంటే Temporary Speaker గారు చెప్పిన విషయమేమిటంటే "నేను ఆలస్యముగా వచ్చాను. ఆ కారణంచేత ప్రశ్నలు పంపించలేకపోయాను." అని చెప్పియున్నారు. గనుక ఆ privilege motion వారు oppose చేయలేదని అనుకుంటున్నాను. ఇప్పుడు సభ్యులయొక్క హక్కులు భంగపడ్డవా? లేదా? అనేది నిర్ణయించవలసియున్నది. ఈవిషయము discuss చేసి దానిమీద ఈవిషయము dispose off చేయాలే గాని discussion కు రాకుండా కాదని, ruling యివ్వటము బాగుండదని అంటున్నాను. Temporary Speaker గారు "నేను ఆలస్యముగావచ్చాను ఆ కారణము చేత ప్రశ్నలు పంపించలేకపోయాను" అని చెప్పారు. అందువల్ల సభ్యులయొక్క హక్కులు భంగపడ్డవా? లేదా? అనేసంగతి యిప్పుడు నిర్ణయించవలసియున్నది. కారణము ఏమిటంటే ఒకటిన్నర నెలగా యీ అసెంబ్లీ పనిచేస్తున్నప్పుడు ఒక సభాధ్యక్షుణ్ని తాత్కాలికంగా వెంటనే నియమించకపోవటమువల్ల ప్రశ్నలు ఎజెండాలోకి రావటానికి వీలుకాలేదు. అందువల్ల సభ్యులహక్కులు భంగపడ్డవి అంటున్నాను. ఇదంతా సభ్యులయొక్క విషయముకాబట్టి జాగ్రత్తగా పరిశీలించవలసిఉన్నది. అందుకనే అసెంబ్లీ సాంప్రదాయాల కనుగుణంగా కార్యక్రమము నడవనందుకు తెచ్చిన యీ మోషనును విచారించకుండా ruling యిస్తే సభ్యులహక్కులను విస్మరించటమే అవుతుంది. సభ్యుల హక్కులను రక్షించటానికి పూనుకోకపోవడమే జరుగుతుంది. కాబట్టి అధ్యక్షులవారిని జాగ్రత్తగా పరిశీలించమని విజ్ఞాపన చేస్తున్నాను.

[26th November 1953

The Hon. Sri T. PRAKASAM:—ఈ విషయములో ఇదివరకే ruling యిచ్చారని Speaker గారు చెప్పుతున్నారు. కాబట్టి యీవిషయము మరల చర్చకు తీసుకురాకూడదని అంటున్నాను.

Sri T. NAGI REDDI:—ఇంతకుముందు ruling విషయము రానేలేదు.

The Hon. Sri T. PRAKASAM:—Temparory Speaker గారు ruling యిచ్చారని Speaker గారు చెప్పుతున్నారు.

Sri T. NAGI REDDI:—Temporary Speaker ఆవిధంగా చేయలేదు.

Sri C. V. K. RAO:—Point of Order, Sir. క్రొత్త అధ్యక్షులు వచ్చిన తరువాతనే నేను రెండు హక్కుల తీర్మానములకు నోటీసుయిచ్చాను. అందులో ఒకటి, కె.పట్టాభి రామయ్య, M. L. A. గారిని కాకినాడస్టేషనులో అరెస్టుచేయుటగురించి. రెండు, ప్రగడ కోటయ్య, M. L. A. గారు చేనేత పారిశ్రామికుల హక్కులనుగూర్చి వివరించేటప్పుడు ఆయన్ని అరెస్టుచేయుట గురించి. వీట్లపై చర్చకు అవకాశమివ్వమని కోరుచున్నాను.

Mr. SPEAKER:—నాకు రెండు privilege motions యిచ్చారు. అవి 28 వ తారీఖున ఉదయము 10 గంటలకు discussion కు తేవచ్చునని అర్డరువేశాను. No more points of order, please.

* Sri T. NAGI REDDI:—Point of order raise చేసినప్పుడు, అది విన్న తరువాత క్లోసిచేయడం న్యాయంగాని వినకముందే, No points of order అని క్లోసి చేయడం నా 2½ సంవత్సరాల ఎసెంబ్లీ అనుభవంలో నేను చూడలేదు.

Mr. SPEAKER:—Point of order raise చేసినప్పుడు Speaker regulate చేయవలసిన విధియున్నది. (applause)

Sri T. NAGI REDDI :—Mr. Speaker, Sir. ఇంతవరకూ వచ్చిన points of order అన్నీ అవసరమైన points of order కావా? ఒక సభ్యుడు point of privilege raise చేసినారు, ఇంకొకసభ్యుడు point of order raise చేస్తే సభా కార్యక్రమం obstruct చేయడానికి point of order raise చేస్తున్నారని మీరనడం సబబుకాదు. ఈ ఆరోపణద్వారా కూర్చోమని చెప్పడం చాలా అన్యాయమనీ, మంచిదికాదని విజ్ఞప్తి చేస్తున్నాను. Points of order లేవదీస్తున్నారంటే, మొదటి రోజున points of order లు 90 ఉండటానికి అవకాశంవుంది. ఈ సందర్భాలలో ఈ క్లిష్టమైన పరిస్థితులలో point of order క్లోసిచేయడం చాలా విచారకరమనీ, మంచిదికాదనీ, Leader of the Oppostion గా చెప్పుతున్నాను.

Mr. SPEAKER:—No more points of order, please. The general discussion on the Governor's Address will now be taken up.

* Sri VAVILALA GOPALAKRISHNAIAH:—Mr. Speaker, Sir, on a point of order. గవర్నరుగారి ఉపన్యాసానికి అభివందనములు తెలిపే తీర్మానం Ministerialist party వారు మాత్రమే move చేయాలి. కాని దాన్ని అధికారాయుల

రెడ్డిగారు తెచ్చారు. వారు K. M. P. పార్టీవారు, ఆయన కోయలీషన్‌లో ఉన్నారని చెబుతారా ? అట్లాఐతేనే Ministerialist Party move చేసినట్లవుతుంది. లేకపోతే యీ motion ఆయన తెచ్చుటకు వీలు లేదు. ఈ విషయం నేను rule (5) (1) ప్రకారం చెప్పుచున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI:—అధ్యక్షా ! ఆదినారాయణరెడ్డిగారు ఏపార్టీకి చెందినవారో, వారే నిర్ణయించుకుంటారు. ఏపార్టీకి చెందినవారో నిర్ణయించుకోవడం వారికే వదిలిపెడితే బాగుంటుంది. కాని ఆయన బాధ్యతగల నాయకుడు. Ministerialist పార్టీలో ఉన్నారో లేదో వారే నిర్ణయించుకుంటారు.

*Sri K. RAJAGOPALA RAO :—అధ్యక్షా! వారు ఏపార్టీకి చెందినవారో, Ministerialist Party అవునా కాదా అన్నవిషయం తమరే నిర్ణయం చేయవచ్చును. సంజీవరెడ్డిగారు చెబితే చాలదు. తమరు ఆయా పార్టీల lists తీసి వారు Ministerialist Party అవునో కాదో తేల్చాలి.

The Hon. Sri T. VISWANATHAM:—Point of order గోపాలకృష్ణయ్యగారు చెప్పింది మామూలుగాను, సరసంగాను ఉంది. Ministerialist Party అంటే గవర్నమెంటును support చేసే పార్టీ అని అర్థం. అంతకన్న ప్రమాదమైన point ఏమీలేదు. (నవ్వు)

* Sri VAVILALA GOPALAKRISHNIAH :—ప్రమాదమైన సమస్య ఏమీలేదు. ఏపార్టీనుంచి ministerలు వస్తే వారు Ministerialist పార్టీ అవుతారు. ఆపార్టీనుంచి ఒక minister ఉన్నారని చెబితే నేను ఒప్పుకుంటాను. ministerలు చేసే పత్రికా ప్రకటనలుచూస్తే ఇది కోయలీషన్ మినిస్టరీ అవునా కాదా అనే సందేహం కలుగుతోంది. (నవ్వు) సంజీవరెడ్డిగారు చెప్పినట్లు వారే ఈ విషయం తేల్చి, ఈ motion move చేస్తే బాగుంటుంది. Deputy Chief Minister గారు ఇది కోయలీషన్ మినిస్టరీ కాదు, కాంగ్రెసు మినిస్టరీ అని ప్రకటిస్తారు. విశ్వనాథంగారు కోయలీషన్ మినిస్టరీ అని ప్రకటిస్తారు. (నవ్వు), (కరతాళధ్వనులు). ఇదివరకు ఎల్లాగున్నా, లచ్చన్నగారు చేరిన తర్వాత కోయలీషన్ మినిస్టరీ అయిందని చెబుతున్నారు. (నవ్వు). Ministerialist Party అంటే దానిలోచేరినవారూ ministerialist పార్టీ అవుతారు. పోనీ K. L. P. తరఫున చేస్తే అలాగే అనుకోవచ్చును. విశ్వనాథంగారిపార్టీ P. S. P. అవునా కాదా అనే స్థితిలోకి వచ్చింది. (The Hon. Sri T. Viswanatham_అలా అదీచెబితే తప్పే) వారు ఆ పార్టీ అనిచెబితే మా కభ్యంతరంలేదు. ఆయన నేను ministerialist పార్టీయే అని చెప్పివేస్తే అభ్యంతరం ఉండదు. ఈ Point clear చేయవలసిందని కోరిక.

Mr. SPEAKER:—I rule out the point of order. Ministry, Congress మినిస్టరీయా లేక ఇంకొక Ministry యా అని decide చేసేఅవసరం నాకు కనిపించలేదు. I hold the Hon. Member is entitled to move his motion.

## III. DISCUSSION ON HIS EXCELLENCY THE GOVERNOR'S ADDRESS.

---

*Sri Y. AUDINARAYANA REDDI: Sir, I move:*

*"That a humble Address be presented to His Excellency the Governor as follows:*

*May. it please Your Excellency,*

*We, the members of the Andhra Legislative Assembly beg leave to thank Your Excellency for the Address delivered to the House on the 24th November, 1953."*

అధ్యక్షా! ఈ తీర్మానం తీసుకువచ్చేందుకు నాకు అవకాశం ఇచ్చినందులకు, ప్రథమంలో అధ్యక్షులైన మీకు, ప్రభుత్వపక్ష నాయకులైన ప్రకాశంగార్కి, వారి పక్షానికి అభినందన లర్పించుచున్నాను. ఈ దినం మన ఆంధ్రరాష్ట్రం ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడింది; అంటే అది మహాత్యాగియైన పొట్టి శ్రీరాములు గారి ప్రాయోపవేశంవల్లనే రాష్ట్రంవచ్చిందని అందరికీ తెలుసును. అటువంటి ప్రథమ భాషా ప్రయుక్తరాష్ట్రంలో మనకు ప్రథమంగా గొప్ప అనుభవశాలియైన త్రివేదీగారు గవర్నరుగా రావడం గొప్ప అదృష్టం. అటువంటి ఆంధ్రదేశంలో ఏకైక ప్రజానాయకుడైన ప్రకాశంగారు నాయకుడు కావడం గొప్ప అదృష్టం. అంతే కాకుండా రాష్ట్రం ప్రారంభం ఐనదో లేదో, మనకు వర్షాలు బాగాపడినవి. వర్షం పడడంతో కరువుకూడా హెచ్చుకాకుండా పూర్తిగా నశించిపోయే పరిస్థితులు వచ్చినవి. కరువు పోయి ప్రజలు సుభిక్షమైన పరిస్థితులలో బ్రతకగల్గుటకు అవకాశములు ఏర్పడుచున్నవి. మన రాష్ట్రం మదరాసు రాష్ట్రంలో ఉన్నప్పుడు మామూలుగా ఒక రాష్ట్రంలో అనగా కరువుతో వెనుకపడిన రాష్ట్రంలో భాగంగా ఉంటూ వచ్చాము, కాని ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తరువాత మనది మిగులురాష్ట్రం. మనది మిగులు ప్రాంతంగా ఏర్పడుటకు హెచ్చు అవకాశాలున్నవి కనుక మనరాష్ట్రంలో పండిన ధాన్యం ఇతర రాష్ట్రాలకు పంపే అవకాశం మనకున్నది.

10-30 a.m. అయితే మనరాష్ట్రం ఏర్పడినతరువాత వర్షాలు రావడంలో ఒక ప్రమాదం సంభవించింది. రాష్ట్రంలో గోదావరి వరదలవల్ల బ్రహ్మాండమైన నష్టం కలిగింది. కాని ప్రభుత్వం తక్షణం తగిన సమయంలో తగిన సహాయం ప్రజలకు అందచేయడంవల్ల, ప్రజల స్వయంకృషివల్ల ఆ ప్రమాదంనుంచి తప్పుకోగలిగాము. ఆ తప్పుకోడంలో సహకరించిన ప్రజాసంఘాలు, ప్రభుత్వం, ఉద్యోగస్తులను అభినందించవలసివున్నది. ఇకముందు భారత ప్రభుత్వ సహాయంతో మన రాష్ట్ర ప్రభుత్వం పంచవర్ష ప్రణాళిక నొకదానిని అమలుపెట్టబోతోంది. దీనిక్రింద 50 కోట్ల రూపాయిలను ఖర్చుచెయ్యవలసిన అవసరం వున్నది. ఇందులో దాదాపు 27 కోట్ల రూపాయిలు ఇరిగేషను ప్రాజెక్టులక్రింద వ్యవసాయ సౌకర్యాలక్రింద ఖర్చుబెట్టబోతున్నదని తెలిసినందుకు సంతోషంగావుంది. ఇరిగేషను ప్రాజెక్టులే కాకుండా మాచిఖండు స్కీమువంటి విద్యుచ్ఛక్తి కార్యక్రమాలు, తుంగభద్రా ప్రాజెక్టువంటి విద్యుచ్ఛక్తికి ఉపయోగించే కార్యక్రమాలు చేర్చి ప్రభుత్వం ఈ ప్రణాళిక క్రింద 17 కోట్ల రూపాయిలు ఖర్చుపెట్ట పూనుకున్నందుకు చాలా ముదావహముగా వున్నది. ఈ కార్యక్రమాలన్నింటిని అమలుపరచడంవల్ల మన

దేశంలో వుండే కరువుకాటకాలను పోగొట్టి, ఇకముందు కరువుకాటకాలు రాకుండా వుండే మార్గాలు ఏర్పరచినందుకు నేను ఆనందిస్తున్నాను. కాంగ్రెసు ప్రభుత్వం చాల కాలంనుంచి అన్నిపార్టీలకు ఒప్పుదలయైన separation of the judiciary from the executive వంటి కార్యక్రమం అమలు జరుపుతోంది. ఆ కార్యక్రమం మరోకజిల్లాలో అమలుపెట్టబోతున్నందుకు నేను ప్రభుత్వమువారిని అభినందించుచున్నాను. ఈ కార్యక్రమాన్ని మిగిలిన జిల్లాల్లోకూడా త్వరలో ప్రవేశపెట్టగలరని ఆశిస్తున్నాను. రాష్ట్రంలో వుండే చేనేత పారిశ్రామికుల పట్ల ప్రభుత్వం ప్రత్యేకశ్రద్ధ చూపిస్తున్నసంగతి గమనించ తగ్గ విషయం. చేనేత పారిశ్రామికులకు ప్రభుత్వం అన్నివిధాలాకూడా తమ శక్తివంచన లేకుండా సహాయపడాలి అని ప్రభుత్వంవారు నిర్ణయించుకోవడం చాలా సంతోషించ తగిన విషయం. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన నాటినుంచి ఆంధ్ర రాష్ట్రానికి ప్రత్యేకమైన హైకోర్టు కావాలి అని కోరుకొంటున్నాం. అది చాలా అవసరంకూడా. దానికికూడా ప్రభుత్వం తక్షణం పూనుకొని అందుకు తగిన బిల్లు శాసనసభలో ప్రవేశపెట్టే కార్యక్రమానికి పూనుకొంటారని ఆశిస్తున్నాను. మొన్న శ్రీ ఖండవల్లి కృష్ణరావుగారు డిప్యూటీ స్పీకరు ఎన్నిక సందర్భంలో మాట్లాడుతూ ఇది పోలీసు రాజ్యం అని, ఇక్కడ శాసనసభ్యులకు వుండే వసతులు డిటెన్షన్‌లో వుండే A తరగతి ఖైదీలకన్న ఎక్కువగా లేవనీ విమర్శించడం జరిగింది. దీన్నిగురించి ఒక విషయం చెప్పదలిచాను. ఉన్న కొద్ది వ్యవధిలో, రాజధాని మార్చివేయాలి అని చెప్పబడుతున్న సందర్భంలో, ఇంతకన్న ఎక్కువ సౌకర్యాలు కలిగించడం సాధ్యమా అని ఆలోచించమని కోరుతున్నాను. జూను నెల 5 వ తారీఖున తాత్కాలిక రాజధాని కర్నూలు అనే నిర్ణయం జరిగింది. అప్పటి నుంచి మిత్రులందరు కర్నూలునుంచి రాజధానిని మార్చివేయాలి అని ప్రయత్నాలు చేస్తూనే వున్నారు. ఆ మిత్రులే ఈనాడు ఎలాంటి సౌకర్యాలు లేవని విమర్శించడం జరుగుతోంది. (Interruption) 50 లక్షలు ఖర్చుపెట్టారు కదండి, 50 లక్షలు చాలవు, కనీసం రెండు కోట్ల రూపాయిలైన ఖర్చుపెట్టాలి, ఈ రాజ్యాన్ని తమచేతికి అప్పచెప్పమని పుల్లారెడ్డిగారు అంటున్నారు. వారికి అప్పచెప్పితే ఎలాంటి freedom of speech వుంటుందో అందరికి తెలుసును. (నవ్వు - కరతాళధ్వనులు)

Mr. SPEAKER:—గాలరీలో వుండేవాళ్లు చప్పట్లు కొట్టరాదు. అల్లాచప్పట్లు కొడితే ఇక్కడ సభావ్యవహారాలు నడవడం సాధ్యంకాదు. అందుచేత గాలరీల్లో వుండే ప్రేక్షకులు నిశ్శబ్దంగా కూర్చోవాలి అని మొదటిసారిగా మనవి చేస్తున్నాను.

Sri Y. AUDINARAYANA REDDI:—అధ్యక్షా, మన రాజధానినిగురించి నేను ఏమీ క్రొత్తగా మాట్లాడదలచలేదు. ఇక్కడ జరిగిన సౌకర్యాలనుగురించి ఒక మిత్రుడు మాట్లాడినందువల్ల కొంచెంగా మాట్లాడ్డం అవసరమైనది. మన రాష్ట్రంలో ప్రభుత్వం ఏర్పడిన పరిస్థితులు మనకు తెలుసును. ప్రభుత్వం అన్ని పక్షాలతో కూడినదని అనుకుంటున్నారు. అన్ని ప్రజాస్వామిక పక్షాలు కలిసి ఈ ప్రభుత్వాన్ని ఏర్పరచడంలో కొంత ఇబ్బందులు కలిగినా, చివరికి ప్రభుత్వాన్ని ఏర్పరచగలిగినందుకు ప్రజాస్వామిక పక్షాలన్నిటికి నా ధన్యవాదముల నర్పిస్తున్నాను. ప్రభుత్వపక్ష సభ్యులుగాని, ప్రతిపక్ష సభ్యులుగాని ఒకటి గమనించవలసి వున్నది. పొట్టి శ్రీరాములుగారు తమ అమూల్య ప్రాణాన్ని త్యాగం చేయడంద్వారా మనకు ఈ రాష్ట్రం సిద్ధించింది. ఇంత త్యాగ ఫలంగా ఏర్పడిన నూతన రాష్ట్రమును అభివృద్ధి చేసుకోవడంలో చిన్న చిన్న విభేదాలను

విస్మరించి ప్రభుత్వంతో సహకరించి, ప్రభుత్వంవారు ప్రజలకు సేవచేసేందుకు అవకాశం కల్పించమని ప్రతిపక్షసభ్యులను కోరుచున్నాను. కరువుకాటకాల సంగతి మొదట్లోనే చెప్పాను. గత 6 సంవత్సరాలనుంచి రాయలసీమలో కరువుకాటకాలు తాండవిస్తున్న సంగతి అందరికు తెలుసును. నేడు ఈ కరువునుంచి బయట పడేందుకు ఎక్కువ అవకాశం వున్నది. ఆ అవకాశాలను వినియోగించుకొని ప్రభుత్వం ప్రజలను ముందుకు తీసుకుని పోయేందుకు ప్రయత్నం చేస్తుందని నేను సంపూర్ణంగా నమ్ముతూ, ఈ అవకాశాన్ని నాకు కల్పించినందుకు స్పీకరుగారికి వందనము లర్పిస్తూ నేను విరమిస్తున్నాను.

10-40 a.m. The Hon. Sri T. PRAKASAM:—గవర్నరు అయినటువంటి శ్రీ త్రివేదిగారు ఆంధ్రా స్టేటు formation విషయంలో వారి జీతంలో 1200 రూపాయలు మినహాయించుకొని ఆసొమ్ము Andhra State కు యిచ్చుటకు తీర్మానం చేసుకున్నారన్న సంగతి మాకు తెలియజేశారు. గనుక అది చాల ముఖ్యమైనటువంటి అంశము. ఆయన గవర్నరు అయినప్పటికీ కూడా తన జీతంలోనుంచి నెలకు 1200 రూపాయలు మినహాయింపు చేసుకొన్నందుకు వారికి మనందరము కూడా, ప్రజలందరము కూడా వందనాలు చేయవలసియున్నది. ఆయన చాలా గొప్పపని చేశాడు. ఏదయినా చేయవచ్చును గాని సాధారణంగా అందరూ డబ్బుదగ్గర గట్టిగా ఉంటారు (నవ్వు). అందుకు చాలా సంతోషిస్తున్నాను. వారిని అభినందించవలసి యున్నదని నేను చెబుతున్నాను.

* Sri L. LAKSHMANA DAS:—అధ్యక్షా, నేను గవర్నరుగారి ఉపన్యాసముపై Y. ఆదినారాయణ రెడ్డిగారి తీర్మానాన్ని బలపరుస్తున్నాను. ముఖ్యంగా ఈ బ్రహ్మాండమైన, చరిత్రాత్మకమైన ఈ సమావేశంలో ఈ గవర్నరుగారి ప్రసంగంపై తెచ్చిన ఈ తీర్మానమును బలపరచే భాగ్యం నాకు కలిగినందుకు గర్విస్తున్నాను. ముఖ్యంగా యిది చరిత్రాత్మకమైన సమావేశం అని చెప్పకోవడంలో కారణం ఉన్నది. ఎందుకంటే భాషాప్రయుక్తరాష్ట్రాల స్థాపన జరగాలని 1929లో కాంగ్రెసు మహాసభ నిర్ణయించినతరువాత మొట్టమొదటిసారిగా వచ్చిన భాషారాష్ట్రం మన ఆంధ్ర రాష్ట్రం. ఆంధ్ర రాష్ట్రం యొక్క భవిష్యత్తు యీ ఆంధ్రరాష్ట్రంలో ఇక్కడకూర్చున్న శాసనసభ్యులైన మనం చేసే నిర్ణయాలపై ఆధారపడి ఉండగలదు. మనం నిర్ణయంచేసిన నిర్ణయాలనుబట్టి, మనప్రవర్తనలనుబట్టి దేశంలో తక్కిన భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడడం జరుగుతుంది. ఈనాడు భారతదేశంలోఉన్న ప్రతి భాషారాష్ట్రవాదికూడా మనవైపు ఆత్రంతో ప్రతినిమిషము ఎదురుచూస్తూనే యున్నాడు. అందుచేత యీ సమావేశంలో శాసనసభ్యులైన మనం, ఉభయపక్షాలూ చాల జాగ్రత్తగా ప్రవర్తించి, భాషారాష్ట్రాలలో నమ్మకం కలిగించి పై రాష్ట్రాల అభివృద్ధికి తోడ్పడవలసినవిధి అని గుర్తించాలి అని హృదయపూర్వకంగా మనవిచేస్తున్నాను. మనఅదృష్టవశాత్తు ఈనాడు శాసనసభకు ఆంధ్రదేశంలోనేకాకుండా యావద్భారత దేశంలో గౌరవించబడిన వ్యక్తి మనకు, యీ సభకు నాయకుడుగా ఉండడం ప్రధానమంత్రి కావడం మన అదృష్టం అని భావిస్తున్నాను. శ్రీ ప్రకాశం పంతులుగారి హయాంలోనే మనం రేపు విశాలాంధ్ర స్థాపించుకోగలం అనీ, విశాలాంధ్రకు కూడా శ్రీ ప్రకాశంపంతులుగారే ప్రధానమంత్రి కాగలరన్న నమ్మకం నాలో పూర్తిగా ఉన్నది. (హర్షం). అందుచేత మనం యీ విషయంలో చాలజాగ్రత్తగా, కట్టుదిట్టంగా పనిచేస్తే తప్పకుండా విశాలాంధ్రను అనతికాలంలోనే సాధించగలం అనే నమ్మకంలో ఉండి ఏమీ సందేహాలు లేకుండా ఉండాలనిమాత్రం హృదయపూర్వకంగా శాసనసభ్యు

లందరిని నామిత్రులందరిని వేడుచున్నాను. ఎందుకంటే ఈనాడు మనం సాధించిన యీ రాష్ట్రం కడు శాంతియుతంగా సాధించుకున్నాం. అంతేకాకుండా ఎంతో త్యాగంచేసిన పొట్టి శ్రీరాములుగారి త్యాగఫలితంగా వచ్చిన ఈ రాష్ట్రాన్ని మనం జాగ్రత్తగా కాపాడడం కాకుండా పొట్టి శ్రీరాములుగారి భాషాప్రయుక్త రాష్ట్ర సిద్ధాంతం దేశంఅంతటా వ్యాపింపజేసే బాధ్యతను గుర్తించి జాగ్రత్తగా నడుచుకోగలం అని నేనుకూడా ఆశిస్తున్నాను. ముఖ్యంగా మన రాష్ట్రం తరువాత యింకా ముఖ్యమైన విషయం ఒకటి ఈనాడు శాసనసభలో ఉన్నది. ప్రజాస్వామిక శక్తులన్నీ కలసి ప్రభుత్వస్థాపన చేసుకోవడం మొట్టమొదట ఆంధ్రదేశంలో జరిగింది. ఈ కృషికి ముఖ్యంగా కాంగ్రెసు నాయకుడు గౌరవనీయులైన శ్రీ సంజీవరెడ్డిగారికి అభినందనలు అర్పిస్తున్నాను. ప్రజాస్వామికశక్తులన్నీ ఏకంఅయి పనిచేసుకోగలవని ఋజువు చేసికోడం మనం నిర్వహించవలసినబాధ్యత. ఆంధ్రదేశంలో ఈ 3 పార్టీల కలయికపైన వారి స్నేహాలమీద ముందుకార్యక్రమం ఆధారపడిఉంటుందని భావిస్తున్నాను. అందుచేత ఈ చరిత్రాత్మకమైన సమావేశానికి ప్రాముఖ్యత కూడా ఉన్నది. కొంతమంది చరిత్రకారులు దీన్నిగురించి ఎంతయినా వ్రాయడానికి అవకాశాలున్నాయని మనవిచేస్తున్నాను. ఆంధ్ర రాష్ట్రం స్థాపించుకొని ఒక నెల 25 రోజులే అయినప్పటికీ ఈ కొద్దికాలంలో గవర్నరు, మన ప్రభుత్వం ఆంధ్రదేశంలో ప్రధానమైన సమస్యలనుగురించి తన ఉపన్యాసంలో చెప్పడం ఎంతైనా గుర్తించవలసిన విషయం. మన రాష్ట్రంలో రెండే రెండు ముఖ్యమైన సమస్యలున్నాయి. రెండూ పరిశ్రమలకు సంబంధించినవి. ఆ పరిశ్రమలు : ఒకటి వ్యవసాయం; రెండోది చేనేత. వ్యవసాయం విషయంలో ప్రభుత్వం ఎంతో శ్రద్ధ తీసుకొని అభివృద్ధి కరమైన ప్రణాళికలు తయారుచేయగలరని యీ ఉపన్యాసంలో పేర్కొనబడింది. పంచవర్ష ప్రణాళిక క్రింద 51 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి ఇక్కడఉన్న మైనరు ఇరిగేషన్, మేజరు ఇరిగేషన, ఎలక్ట్రిసిటీ మొదలైన అభివృద్ధి పనులు చేయడానికి పూనుకుంటారని, ఈనాడు తమ ఉపన్యాసం ద్వారా ప్రజలకు తెలియజేసినందుకు ప్రజలెంతో సంతోషించగలరని ఆశిస్తున్నాను. వ్యవసాయం తరువాత ముఖ్యమైన పరిశ్రమ మన భారతదేశంలో చేనేత పరిశ్రమ. దాని విషయంలో కూడా ప్రభుత్వం బ్రహ్మాండమైన శ్రద్ధ తీసుకొని చర్యలు తీసుకోన నిశ్చయించినట్టుకూడా ఉపన్యాసముద్వారా తెలిపినందుకు సంతోషిస్తున్నాను. ఈ రెండు విషయాల్లోకూడా మనం శాసనసభ సహకారం సాధించుకోగలం అని ఆశిస్తున్నాను. ప్రజానీకం యొక్క కష్టాలను తొలగించడానికి బ్రహ్మాండమైన శ్రద్ధతీసుకోగలరని ఉపన్యాసంలో పేర్కొనబడింది. అందుకు గవర్నరుగారికి ప్రభుత్వానికికూడా హృదయపూర్వకంగా అభినందనలు తెలియజేస్తున్నాను. ఒక సలహాయిస్తున్నాను. దేశంలో రెండే రెండు ప్రాంతాలున్నాయి. అభివృద్ధిఅయిన ప్రాంతాలు, వెనుకబడిన ప్రాంతాలు. మైనరు, మేజరు ఇరిగేషను పనులలో వెనుకబడిన ప్రాంతాలకు ప్రాధాన్యత నివ్వాలని మనవిచేస్తున్నాను.

వెనుకబడిఉన్న భాగాలను కొంత అభివృద్ధిపరిచేవరకు, కొంచం ముందుకు తీసుకుపోయేవరకు అభివృద్ధిపరచబడిన ప్రాంతాలను కొంతకాలం ఆగమని చెప్ప కోరుతున్నాను. ముఖ్యంగా మనలో అనేక మంది వెనుకబడిన భాగాలవారంటే ఒక్క రాయలసీమవారు మాత్రమే అని భావిస్తున్నారు. కాని, అనేక లక్షల జనాభాగల శ్రీకాకుళం, విశాఖజిల్లాలు రాయలసీమకు ఎంతమాత్రం తీసిపోవని, ప్రభుత్వం సరిగా సహకరించలేక పోయిందని చెప్పడానికి నేను విచా 10-50 a.m.

రిస్తున్నాను. శ్రీకాకుళం జిల్లాలో వంశధార ప్రాజెక్టు నిర్మించినట్లయితే శ్రీకాకుళం, విశాఖ జిల్లాలకు కావలసిన ఆహారపదార్థాలే కాకుండా ఇంకా రెండు మూడు జిల్లాలకు కావలసిన ఆహారపదార్థాలను మేము సరఫరాచేయగలమని నేను హామీ ఇస్తున్నాను. వంశధారమీద 1884 లో సింటుగిడి అనేచోటున ఒక రిజర్వాయరును కట్టి ఆ రిజర్వాయరుద్వారా నాలుగు లక్షల ఎకరములు సాగుచేయవచ్చునని అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం అంచనాలువేసింది. కాని అక్కడ ఉండే జమిందారుల వల్ల అది అప్పుడు ఆగిపోయింది. ఆ తర్వాత ప్రకాశం పంతులుగారు కొంతవరకు చేశారు. తరువాత మొన్న మొన్ననే రాజాజీ టైములో మదనాపురం అనేచోట ఆనకట్టకట్టారు. మదనాపురం, సింగిడి తాలూకా అనే భేదంలేకుండా ఇప్పుడు మనకు నాలుగు లక్షల 50 వేల ఎకరాలు ఈ ఆనకట్ట క్రింద సాగురాగలదు. తరువాత నాగావళి ఆనకట్టకూడా కట్టబడగలదని ఆశిస్తున్నాను. మాకు శ్రీకాకుళం, విశాఖ జిల్లాలకు చెందినంతవరకు ఇవే కాకుండా అనేక మైనరు ఇరిగేషన్ పథకాలు ఉన్నాయి. నేను అవన్నీకూడా అమలు చేస్తారని సంపూర్ణంగా ఆశిస్తున్నాను. తరువాత ఈ చేనేత పారిశ్రామికుల విషయంలో అభివృద్ధికి తగిన కృషిచేస్తున్నందుకు నేను ప్రభుత్వంవారిని అభినందిస్తున్నాను. ప్రభుత్వం వారు చేనేత పారిశ్రామికులు ఉత్పత్తిచేసే బట్టపైవచ్చే ఏ మాత్రం నష్టాన్నైనాకూడా భరించి, ఈ చేనేత పారిశ్రామికులపట్ల వారిరక్షణకు ఎంతో శ్రద్ధ తీసుకొనకున్న ఈ విషయంలో చాలా కష్టనష్టాలను ఎదుర్కొనవలసి ఉంటుంది. అందుచేత దీన్ని ఇంకా అభివృద్ధిచేయడానికి ఇప్పుడు తగిన ప్రణాళికను తయారుచేసుకోవాలి. బ్రిటిష్ ప్రభుత్వ కాలంలో ఈ పరిశ్రమ దెబ్బతిన్నదని చెప్పటానికి కారణం వాళ్ల దేశంలో ఈ ఉత్పత్తి అయ్యే మిల్లు బట్టలకు గిరాకి తగ్గుతుందనే కారణంచేతనే వాళ్లు ఈ చేనేత పరిశ్రమను ఎంతో అశ్రద్ధచేశారు. కాని, ఈ నాడు మన జాతీయ ప్రభుత్వమైనా శ్రద్ధతీసుకొని ఈ పరిశ్రమను అభివృద్ధి చేస్తారని నేను ఎంతో ఆశిస్తున్నాను. గోదావరి వరద ప్రాంతాల్లో మన ప్రభుత్వం తీసుకొన్న సత్వర చర్యలను బట్టిచూస్తే ప్రభుత్వం ఎక్కువగా చిక్కులు పడుతున్న ప్రజలకోరకు వెంటనే చర్యతీసికోగలదని రుజువు అవుతున్నది. ప్రభుత్వ తక్షణచర్యల విషయంలో ఈ ప్రభుత్వాన్ని నేను అభినందిస్తున్నాను. తరువాత మడుమూ ఎలెక్ట్రిసిటీ 1955 లో రాగలదని గవర్నరు ప్రసంగంలో పేర్కొన్నందుకు చాలా అభినందిస్తున్నాను. ఈ ఎలెక్ట్రిసిటీ ఏ జిల్లాలలో ఉత్పత్తి అవుచున్నదో ఆజిల్లాలకు ముందుగా సప్లయిచేయాలని నేను కోరుచున్నాను. మనరాష్ట్రం ఏర్పడినతరవాత ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసుకొని రెండు నెలలైనా కాకుండా హైకోర్టు ఎక్కడో పరాయి ప్రదేశంలో ఉండడం అంగీకరించలేని విషయం. దీన్ని తక్షణం 1954 జులైలోగా మార్చాలి. అంతేకాకుండా మద్రాస్‌లో ఉన్న ఆఫీసుల్లో [illegible]టీకూడా అక్కడ ఉంచకుండా ఎంత సత్వరంగా అయితే అంత సత్వరంగా తరలి[illegible]వాలని కోరుతున్నాను. ముఖ్యంగా సామిత్యలం అందరికీ ఒక విషయం మనవి చేస్తున్నాను. మనం విశాలాంధ్ర విషయం మరచిపోకుండా దాన్ని సంపాదించాలి[illegible] మనకు ప్రధానం. అది సంపాదించిననాడే మనం పూర్ణ సంపూర్ణత్వం సంపాదిం[illegible]వుతున్నాను. మనం బ్రిటిష్ ప్రభుత్వం రాకముందు ఉన్నటువంటి ఆంధ్ర[illegible]త్రను ఒకసారి చదువుకొని తెలుసుకొంటె మనకు ఒక ఉజ్జ్వలమైన భవిష్యత్తు[illegible] అంతా ముందే ఉంది. మన పూర్వపుటౌన్నత్యాన్ని అభివృద్ధిచేసుకోవడానికి అవకా[illegible] ఉంటుందని నాకు సంపూర్ణంగా నమ్మకం ఉంది. ఇప్పుడు 10 లక్షలజనాభాతో ఒరిస్సాలో ఉన్నటువంటి

ఆంధ్రులనుకూడా మనం చేర్చుకొని, హైదరాబాద్‌లో ఉన్న ఎనిమిది జిల్లాలనుకూడా మనం చేర్చుకున్ననాడు హైదరాబాద్‌ను మన శాశ్వతరాజధాని చేసుకుని, మనం రెండు సంవత్సరాలపాటు ఏకదృష్టితో పనిచేసిన మనరాష్ట్రానికి సమగ్రస్వరూపం ఏర్పడుతుంది అని పొట్టి శ్రీరాములుగారు మనకు చెప్పిపోయారు. ఎంతటి కార్యాన్ని అయినా మనం అహింసా పద్ధతిమీద సాధించగలమని చెప్పిందిమాత్రం మనం మరచిపోకూడదు. మనలో ఎన్నివిభేదాలున్నా ఈ విషయంలో మాత్రం మనమంతా ఏకతాటిపై రావాలని మనమంతా దీన్ని ఆమోదించాలని కోరుతున్నాను. మనమంతాకూడా ఆశించేది మనమిత్రుడు నాగిరెడ్డిగారు చెప్పినట్లు, విశాల భావాలుకల విశాలాంధ్రస్థాపనే. అందుచేత విశాలాంధ్ర స్థాపనకు అంతా తోడ్పడ్డమే నేడు మన ముఖ్య సమస్య అని ప్రతి ఒక్క సామాన్య పౌరునికికూడా ఒక నమ్మకం కలిగించినందుకు సభ్యులకు ప్రభుత్వంవారికికూడా నా అభినందనాలు అర్పిస్తు ఇంతటితో నేను విరమిస్తున్నాను.

Mr. SPEAKER:—"The motion is—

"That an humble Address be presented to His Excellency the Governor as follows :

'May it please Your Excellency,

We, the Members of the Andhra Legislative Assembly beg leave to thank Your Excellency for the Address delivered to the House on the 24th November, 1953.'"

Sri P. VENKATASUBBAIAH:—అధ్యక్షా! మనము నేడు గవర్నరుగారి ఉపన్యాసంపైన చర్చిస్తున్నాము. గవర్నరుగారి ఉపన్యాసములో ప్రజానీకానికి అనువైన విషయాలనుగురించి ఆయన ఆశాజనకమైన అనేక సూచనలు చేశారు. అందుచేత మనము ఆయనను అభినందించడం మన ధర్మం. ముఖ్యంగా ఆయన గోదావరి వరదబాధితుల విషయంలో ప్రభుత్వం తీసుకున్న చర్యలను పేర్కొన్నారు. ఆవిధంగా ప్రభుత్వం ముందుకువచ్చి బాధపడుతున్న ప్రజానీకానికి అనేక విషయాలలో సహాయపడుతున్నందుకు సంతోషపడవలసియుంది. ఇంకా ప్రభుత్వంవారు అనేక విషయాలలో రాబోయే దినాలలో ఏవిధంగా చర్యలను తీసుకోబోతున్నారో వివరించారు. ఇరిగేషన్ విషయంలో ప్రభుత్వంవారు తీసుకొనే చర్యలను, ఇంకా అనేక విషయాలలో ప్రభుత్వం చేయుదలచు కొన్న పనులవిషయమై, వారు సూచించినందుకు వారికి అభినందనలను అర్పించడం మన ధర్మం. మనం నూతన ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చేసుకున్నాము. ఇక మనం విశాలాంధ్రరాష్ట్రాన్ని సాధించవలసివుంది. విశాలాంధ్రరాష్ట్రం మనేటువంటిది మన ఆంధ్రుల ఐక్యతకు, మన ఆంధ్రజాతి కంతకు మంచిదని నేను చెప్తున్నాను. ఇప్పుడు ఆంధ్రరాష్ట్రములోఉండే 11 జిల్లాలు, హైదరాబాదులోవుండే 8 తెలుగుజిల్లాలు, అరవజిల్లాలలోని తెలుగుప్రాంతాలను, మైసూరులోని ఆంధ్రప్రాంతాలను, ఒరిస్సాలోని ఆంధ్రజిల్లాలను మన ఆంధ్రరాష్ట్రంతో చేర్చడానికి ప్రయత్నించాలని మనం దృష్టిలో వుంచుకోవాలి. మనకు విశాలాంధ్రరాష్ట్రం వచ్చినపుడు మనందరికీ ముఖ్యపట్టణం హైదరాబాద్ కాక తప్పదు. కనుక అక్కడ మనకు దబ్బుఖర్చు కాకుండానే మన ఆఫీసులను, క్యాపిటల్‌కు అనువైన, అవసరమైన అన్ని హంగులూ ఏర్పాటు చేసుకోవటానికి వీలుంటుంది. అందుచేత విశాలాంధ్రకొరకు మనం ఎక్కువగా ప్రయత్నించి త్వరలో సాధించాలి. 11-0 a.m.

అప్పుడు మనకు హైదరాబాద్ సహజసిద్ధమైన రాజధాని కాగలదు. అప్పటివరకు, మనం అందరంకలసి యిదివరకు చేసిన నిశ్చయాన్ని, తాత్కాలిక రాజధానిగా కర్నూలును ఉంచడం తప్పకుండా సబబైనటువంటి విషయమని నేను మనవిచేస్తున్నాను. తరువాత గవర్నరుగారి Address లో ఒకవిషయమునుమాత్రం ఆయన పేర్కొననందుకు విచారపడుతున్నాను. ఇప్పుడు ఆంధ్రరాష్ట్రంలో భూమిలేనటువంటి నిరుపేదలైన అనేక మంది హరిజనులున్నారు. వారు అందరు ప్రభుత్వంవారి ఆధీనంలోవున్న బంజరు భూము లను సాగుచేసుకోడానికి ప్రభుత్వంవారు అనుమతివ్వాలి. నిరుపేదలైనవారికి భూములు లేని హరిజనులకు ప్రభుత్వంవారు పనులు కల్పించాలి. హరిజనులు చాలా కష్టపడి సాగు చేసిన బంజరుభూములను భూస్వాములు ఆక్రమించుకుంటున్నారు. అట్లుగాక ప్రభుత్వం వారు, కష్టపడి సాగుచేసేవారికే ఆ బంజరుభూములను సంక్రమింపజేయాలని కోరు తున్నాను. ప్రభుత్వంవారి అధీనంలోనున్న బంజరుభూములను సాగుచేసుకోవడానికి నిరుపేదలయినవారికి దానం చేయాలి. భూదానయజ్ఞంచేసి, భూస్వాములవద్దనుండి ఎక రాల లెక్కను భూమిని సేకరించి నిరుపేదలకు, హరిజనులకు దానంచేస్తే బాగుంటుంది. బంజరుభూముల పంపకం విషయంలో గవర్నర్ గారు ఒక ఆర్డినెన్సు (ordinance) ప్యాస్ చేసివుంటే చాల సమంజసంగా వుండేదని భావిస్తున్నాను. ఇప్పటికైనా మించిపోలేదు కనుక ఈ కార్యానికి ప్రభుత్వం పూనుకొని బంజరుభూములను లెక్కవేసుకొని, నిరు పేదలైనవారందరికి సాగుచేసుకోవటానికి ఈ భూములనిస్తే వాళ్ళందరూకూడా ప్రభు త్వాని కెంతైనా జీవితాంతంవరకు కృతజ్ఞులైవుంటారు. అందుచేత ప్రభుత్వంవారు ఈ విష యమై వెంటనేచర్యలు తీసుకోవడానికి ఆలస్యంలేకుండా గవర్నరుగారు ఒక ordinance ను ప్యాసుచేసినట్లయితే బాగుంటుందని అభిప్రాయపడుతున్నాను. గవర్నరుగారి ఎడ్రె సుకో సంబంధించినంతవరకు ఆశాజనకంగావుందని, ఆయనను అభినందిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

11-6 a.m. **Sri M. HANUMANTHA RAO**:—అధ్యక్షా! ఇప్పుడు మనం గవర్నరుగారి ఉపన్యాసంపైన చర్చ జరుపుకొనేందుకు సమావేశమయ్యాము. ఇది నూతన ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత మొదటి ఆంధ్రశాసనసభా సమావేశము. ఈ మొదటి సమావేశంలో గవర్నరుగారు ఇక్కడ మొట్టమొదటగా చేసిన ప్రసంగాన్నిగురించి మనం చర్చిస్తున్నాము. అయితే యీ ప్రసంగాన్ని చర్చించినపుడు దానిలో ఉదహరింపబడిన అంశాలకు మనం ఆయనను అభినందించవలసిన అవసరం ఉన్నదా, లేదా, అనే విషయాన్ని అసలు మనం ముందు ఆలోచించాలి. మనం గవర్నరుగార్ని ఎందుకు అభినందించాలి? అని నేను అడుగుతున్నాను. గవర్నరు ప్రసంగంపైన కాంగ్రెసుపార్టీవారు అభినందిస్తూ తెచ్చిన తీర్మానాన్ని బలపరుస్తూ శ్రీ వెంకటసుబ్బయ్యగారే విచారాన్ని వెల్లడిస్తే యిక నే నెంతగా విచారించవలసివస్తుంది? పొట్టి శ్రీరాములుగారు 58 రోజులు నిరశనవ్రతంచేసి ప్రాణం బలియిస్తున్న రోజులలో పల్లెత్తు సానుభూతివాక్యం పలకని పెద్దలు యిప్పుడు గవ ర్నరు ఉపన్యాసంద్వారా అయినాసరే ఆయన త్యాగాన్ని కొనియాడినందుకు సంతోషం. ఇంతేకాకుండా, మన ముఖ్యమంత్రిగారు గవర్నరుగారిని అభినందించ వలసి ఉంటుందని ఒక సమాచారాన్ని యిచ్చారు. అదేమిటంటే, ఆయన తన 5 వేల రూపాయల జీతంలో 1200 రూపాయలు తగ్గించుకొని ఆంధ్ర ప్రభుత్వానికి యిచ్చి త్యాగం చేశారని. దారిద్ర్యా వస్థలోవున్న భారతదేశంలో సామాన్యమానవునికి సంవత్సరానికి సగటు ఆదాయం 160 రూపాయలున్నప్పుడు గవర్నరుగారు రోజుకు 160 రూపాయలనుంచి 10 రూపాయలను

తగ్గించుకొన్నంతమాత్రాన్నే అభినందించవలసియున్నదేమో కాని నేనుమాత్రం అభినందించలేను. ఇంతకుముందు మిత్రులు లక్ష్మణదాసుగారు మాట్లాడుతూ ఇది ఒక ప్రజాస్వామిక ప్రభుత్వమని, ప్రభుత్వపక్షాన ఇతర ప్రజాస్వామికవర్గాలు ఉన్నందుకు చాల గర్విస్తున్నామని చెప్పారు. బలే ప్రజాస్వామికం వారిది. ప్రారంభమే మహాగొప్పగా జరిగింది. ఆదిలోనే హంసపాదు పడ్డది. ఈ గవర్నరుగారినే మనకు స్పెషల్ ఆఫీసరుగా లోగడ నిర్ణయించారు. వారికి ముగ్గురు సలహాదారుల్ని నియమించారు. అందులో కమ్యూనిస్టు పార్టీ నాయకుణ్ణి మినహాయించారు. దేశంలో అధికారాన్ని కాంగ్రెసు గుత్తకు తీసుకున్నదా?

ఎన్నుకోబడినటువంటి ప్రతినిధులకు ఆ Special Officer కు సలహా ఇవ్వడానికి హక్కు ఉన్నదా అని ప్రశ్నిస్తున్నాను. ఆ విషయములో ప్రజా ప్రతినిధులకు గాని, పార్టీలకు గాని ఏవిధమైనటువంటి అవకాశ మిచ్చారు? కొంతమందికి మాత్రము ఇచ్చారు గాని ఈ మినహాయింపుకు ఎక్కడ అవకాశమున్నది, ఆంధ్రప్రజలు ఏమి చెప్పుచున్నారు? ఆంధ్ర దేశములో కమ్యూనిస్టుపార్టీ పెద్దపార్టీ, దాన్ని ఆదరించవలసిందని అంటున్నారు. కాంగ్రెసుపార్టీకి 41 స్థానాలు ఇచ్చివుంటే, ఈపార్టీకి 42 స్థానాలను ఆంధ్రప్రజలు సమకూర్చిపెట్టారు. ఆవిధంగా కమ్యూనిస్టుపార్టీని ప్రజలు ఆదరించారు. అటువంటప్పుడు, త్రివేదీగారు Special Officer గా ఉన్నప్పుడు, వారికి సలహా ఇవ్వటానికి ఏపార్టీవారు నియమించబడ్డారు? ఆయనకు ముగ్గురు సలహాదార్లు నియమించబడ్డారు. అందులో ఒక స్థానాన్ని కమ్యూనిస్టు పార్టీకంటె తక్కువ సంఖ్యాబలంగల కాంగ్రెసుపార్టీ నాయకుని కిచ్చారు. రెండవస్థానాన్ని కమ్యూనిస్టుపార్టీకంటె ఎంతో తక్కువసంఖ్యగల ప్రజాసోషలిస్టుపార్టీ నాయకుడి కిచ్చారు. తరువాత కృషిక్ లోక్ పార్టీ నాయకుడికి ఒక స్థానాన్ని ఇచ్చారు. ఈ ముగ్గురు సలహాదార్లను ఏర్పాటు చేశారు. ఇదేనా ప్రజాస్వామ్యము? ప్రజలచే అధిక సంఖ్యాకంగా ఎన్నుకోబడినటువంటి పార్టీకి సలహా ఇవ్వడానికి అవకాశమివ్వ లేదంటే ఇది ఏమి ప్రజాస్వామ్యమని అడుగుతున్నాను. అయితే యిది Opposition పార్టీగదా, దీనికి స్థానమెందు కివ్వాలి అనవచ్చు. శాసనసభ ఏర్పడితేనే Opposition view point చెప్పడానికి అవకాశముంటుంది. Special Officer కు సలహా ఇవ్వడంలో Opposition కు ఏ విధంగా అవకాశం యివ్వబడింది అని అడుగుతున్నాను. ఇటువంటి ముఖ్యమైన విషయంలో, రాజ్యాంగ చట్టాన్ని, సాంప్రదాయాన్ని అనుసరించనక్కరలేదా?

అదే నిరంకుశ విధానంలోనే ఇప్పుడు ప్రభుత్వాన్నికూడా ఏర్పాటుచేశారు. ముఖ్యంగా ఇప్పుడు ఇక్కడ ముఖ్యమంత్రిగా వున్నటువంటివారు, 1952 వ సంవత్సరానికి 1953 సంవత్సరానికి పోల్చి ఏవిధంగా ఉండినది కొంచెం జ్ఞాపకముచేసుకొమ్మని మనవి చేస్తున్నాను. అధ్యక్షులవారికిగూడ గత 1½ సంవత్సరములలో పరిస్థితులు ఏవిధముగా ఉండినవి తెలుసును. 1952-53 లో ఉన్నటువంటి పుస్తకాలను ఒకమారు తిరగవేసినట్లయిన ఆ చరిత్రఅంతా అందరికీ స్పష్టమౌతుంది. ప్రజాస్వామ్యమనేది ఎక్కడనుంచి ఎక్కడకు తిరిగిపోయిందో స్పష్టపడుతుంది. శ్రీమాన్ రాజగోపాలాచారిగారు కాంగ్రెసు పార్టీలో ఉన్నటువంటివారు. అయితే అసెంబ్లీలో సభ్యుడుకూడ కాదు. కాని, కేంద్రప్రభుత్వము నియమించినటువంటి గవర్నరు శ్రీ ప్రకాశగారు వారిని నామినేట్ చేసి ఆయనను హఠాత్తుగా తీసుకవచ్చి ముఖ్యమంత్రిగా చేశారు. అప్పుడు ప్రతిపక్ష సభ్యులు పంతులుగారితో

పహో మేమంతా అసమ్మతి తెలియజేశాము. ఈవిధంగా రాజగోపాలాచారిగారిని ముఖ్యమంత్రిగా నియమించడానికి అవకాశంలేదు. ఈ విషయములో గవర్నరుగారు నిరంకుశంగా ప్రవర్తించారు. ఈఅధికారాన్ని గవర్నరుకు ఎవరిచ్చారని ఆనాడు పంతులుగారు ప్రశ్నించారు. అదేవిధముగా ఈ రోజున ఈ ముఖ్యమంత్రిని ఏవిధముగా నియమించారని ప్రశ్నించవలసి వస్తున్నది. ఏపార్టీనాయకుడని ఆయననుపిలచి మంత్రివర్గము ఏర్పాటుచేయమని కోరారని అడుగుతున్నాను. ముఖ్యంగా ఈ విషయంలో పెద్దపార్టీ అయినటువంటి కమ్యూనిస్టు పార్టీయొక్క నాయకునితో గవర్నరు సంప్రతించారా? పోనీ, అన్నిటికంటె పెద్దపార్టీ అని, బయటవారినిగూడ నలుగురిని కలుపుకొని 46గురు ఉన్నామని చెప్పుకునే కాంగ్రెసుపార్టీయొక్క నాయకుడైన సంజీవరెడ్డిగారితోనైనా గవర్నరు సంప్రతించారా? శాసనసభా కాంగ్రెసుపార్టీలో సహాయసభ్యులుగా చేరారని, కాంగ్రెస్‌పార్టీ నాయకులుకూడ కానటువంటివారిని తీసుకువచ్చి ఇక్కడ ముఖ్యమంత్రిగా నియమించి మంత్రివర్గాన్ని ఏర్పాటుచేయమని చెప్పటానికి గవర్నరుగారికి ఏమిహక్కువున్నది? ఏ సాంప్రదాయమువలన ఈ ఆచరణను అనుసరించారని ప్రశ్నిస్తున్నాను. ఇందులో ఏ సాంప్రదాయమూలేదని చెప్పుచున్నాను. మెజారిటీ పార్టీయొక్క నాయకుణ్ణి ఆహ్వానించి మీరు మంత్రివర్గము ఏర్పాటుచేయండని పిలువలేదు. పోనీ కొంతమందిని కలుపుకొని ఎక్కువ సంఖ్యను చూపుచున్న కాంగ్రెసుపార్టీ నాయకుణ్ణికూడ పిలువలేదు. అదేదీచేయకుండా ఇంకొకపార్టీలో నాయకుడుగాఉండి, ఆపార్టీకి రాజీనామా ఇచ్చి, మరొక పార్టీలోకివచ్చి కలసిపోయినటువంటి పెద్దలను ఆహ్వానించడంలో ఏమి అర్థం ఉన్నదని అడుగుతున్నాను? దీనిలో ఏ రాజ్యాంగ సాంప్రదాయమున్నది? ఏ ప్రజాసామ్య సిద్ధాంతమున్నది? వీరిని ఏవిధముగా నియమించారని ప్రశ్నిస్తున్నాను. ఇది ప్రజాస్వామ్యమునకు బొత్తిగా విరుద్ధమని మనవిచేస్తున్నాను. ప్రజలు చెప్పినదానిని ప్రజలు ఆదరించినవారిని త్రోసిపుచ్చడమేనా ప్రజాస్వామ్యం? 1952 సంవత్సరములో Democratic Front అని ఒకటి ఏర్పడింది. 163 మంది సభ్యులతో ప్రకాశంపంతులుగారి నాయకత్వాన ఏర్పడింది. ఫలానా కార్యక్రమాన్ని అనుసరించి ఈ కార్యక్రమంపైన మేము వారిని నాయకునిగా ఎన్నుకుంటున్నామని చెప్పాము. ఇది మద్రాసు శాసనసభలో ఎక్కువమందితో కూడుకొనినటువంటి అన్నిటికన్న పెద్దపార్టీ గనుక ఈనాయకుణ్ణి ఆహ్వానించి మంత్రివర్గం ఏర్పాటు చేయమనిచెప్పి గవర్నరుగారికి ఒకలేఖవ్రాయడంకూడ జరిగింది. కాని గవర్నరు తిరస్కరించారు. దీనిని తిరస్కరించి 152 మంది సభ్యులు ఉన్నటువంటి కాంగ్రెసుపార్టీయొక్క నాయకుణ్ణి అదియు నామినేట్ చేయబడినటువంటి రాజగోపాలాచారిగారిని ఆహ్వానించి మంత్రివర్గం ఏర్పాటుచేశారు. దీనికి మేము అసమ్మతి తెలుపగా అందుకు రాజగోపాలాచారిగారు ఈ Democratic Front అనేది ఒక హాచ్‌పాచ్ పార్టీ మాత్రమేనని ఒకే ఒక పార్టీ కాదని పంజాయిషీ ఇచ్చారు. ఈవిధంగాఅయితే యీ సాంప్రదాయం ప్రకారం యీనాడు కాంగ్రెసుపక్షం పెద్ద కలగూరగంపగా లేదా? 42 మందే కాంగ్రెసు టిక్కెట్టుపై ఎన్నికైతే వేరు అనేకమందిని కలుపుకొని హాచ్‌పాచ్ మంత్రివర్గం ఎలా ఏర్పడింది? వారికి ఇలాంటి అవకాశం గవర్నరు ఎందుకిచ్చారు? ప్రజాస్వామ్యమా, ప్రజాస్వామ్యము అంటే పూటకొకమాట్లాడగా ప్రజాస్వామ్యము అవుతుందా? ఈ ప్రభుత్వం ప్రజలుకోరినది కానేకాదు. ప్రజలను సంప్రదించి చేసిందిగాదు. ప్రజలు ఎవరూ దీనిచూచి సంతోషించటము లేదు. పార్టీలలో ఈరోజు పెద్దపెద్ద నాయకులుగా వున్నటువంటివారు కాంగ్రెసు [illegible] వ్యక్తిగతంగా ప్రజాస్వామిక సిద్ధాంతములను పక్రమంగా నెరవేరుస్తారని ప్రజలతో

చెప్పివచ్చి ఈరోజు కాంగ్రెసు మంత్రివర్గంలో వచ్చి కూర్చున్నారు. దేశంలో మెజారిటీ పార్టీగా ఉండేవారు ప్రభుత్వము యేర్పరచాలనేసంగతి మరచినారా? ఒకసారి ప్రజలు ఓడించిన కాంగ్రెసుపార్టీ ఈరోజు అధికారములోకి రావటానికి వీలులేదని ప్రజలు కోరుతోంటే యీనాడు ఈ కాంగ్రెసుపార్టీ యితర పార్టీలను చేబట్టుకుని కలగూరగంప పార్టీని యేర్పాటుచేశారు. కాంగ్రెసుపార్టీ అధికారములో వుంచడానికి వీలులేదని ప్రజలు ఎన్నికలలో చెప్పిన పాఠము మరచిపోయారని అనుకుంటున్నాను. ప్రజలు కాంగ్రెసుతోకలసి మంత్రివర్గాన్ని ఏర్పరచమని కోరివున్నారా? సంజీవరెడ్డిగారు ఇది కాంగ్రెసు మంత్రివర్గం అనిఅంటారు. విశ్వనాధంగారు మిశ్రమ మంత్రివర్గమే నంటారు. అయితే ఆర్థికమంత్రి విశ్వనాథముగారు కలగాపులగమే రుచికరంగా వున్నదని అంటున్నారు. ఇటువంటి కలగూరగంప ప్రభుత్వము విశ్వనాథంగారికి రుచికరంగా వుంటుందేమోకాని నాకుమాత్రము విచారకరంగా వున్నది. కాంగ్రెసుకు వ్యతిరేకంగా నిలువబడి గెలిచినవారు కాంగ్రెసుతోకలసి ప్రభుత్వాన్ని యేర్పరచటానికి ఆస్కారము ఎట్లు లభించినదో, ప్రజలుచెప్పినతీర్పు ఎందుకు మరచిపోయినారో అర్థముకాకుండావున్నది. ప్రజల యిష్టప్రకారము ఏర్పరచవలసిన ప్రభుత్వముకు ప్రజాస్వామిక ప్రభుత్వము అంటారుకాని ప్రజలకు వ్యతిరేకంగావున్న యీ ప్రభుత్వము ప్రజాస్వామిక ప్రభుత్వమని ఎట్లా అనిపించుకుంటుంది? కాంగ్రెసును వ్యతిరేకించి యితర పార్టీలలోచేరి గెలిచిన విశ్వనాథంగారు కాంగ్రెసు నాయకులు ఏర్పరచిన మంత్రివర్గములో వచ్చికూర్చున్నారు. ఒకప్పుడు మద్రాసు అసెంబ్లీలో మాట్లాడుతూ జనరల్ ఎన్నికలలో ప్రజలు కాంగ్రెసు ప్రభుత్వానికి వ్యతిరేకత వ్యక్త పరచినట్లుగా ప్రకటించినసంగతి అందరికి విదితమే. విశ్వనాథముగారి ఉపన్యాసములో కొన్ని విషయాలు నేనిప్పుడు మీకు చదివి వినిపించెదను:

"We have been saying that the issue was whether the people wanted the Congress to come again to power and whether they should continue in office. There were independent candidates, communist candidates and there were other parties which fought the elections and stood against the Congress candidates and in all these cases what was the thing that was put before the electorate? Come to my constituency or any neighbouring one or take out any constituency at random. What was the issue that was placed before them? Ask the peasant, ask the worker, ask the clerk and ask the liberal-minded man. To every one of them the issue was clear and that was whether the Congress should continue in office or not, and there was no denying it, and the result showed beyond doubt that Congress rule was not wanted. Take the results in my own Telugu districts;"

Sri S. NARAYANAPPA:—మదరాసు శాసనసభలో పద్ధతులు, చరిత్ర అర్థముచేసుకోకుండా ఈ శాసనసభలో చర్చించటము చాలా వికృతముగా ఉన్నది.

Sri M. HANUMANTHA RAO:—తమ ముఖాలు అద్దములో చూసుకొంటే ఎంత వికృతముగా వుంటాయో చూడటానికి నారాయణప్పగారు భయపడుతున్నారా?

Mr. SPEAKER:—You should address the Chair and not the members.

Sri M. HANUMANTHA RAO:—ప్రజాస్వామిక మనోభావాన్ని మనము ఇక్కడ ధిక్కరించాము. రాజ్యాంగ సాంప్రదాయాన్ని మనరించాము అంటే అందులో

గూడా యిక్కడ న్యాయము కనపడలేదు. ఇవన్నీకూడా విశ్వనాథముగారు మదరాసు శాసనసభలో చెప్పినమాటలే నేనిక్కడ చెప్పుతున్నాను. అప్పుడు వారిచ్చిన ఉపన్యాసము యీక్రింది విధముగా ఉన్నది:

"Out of 143 seats only about 40 people were returned on Congress ticket. The issue was there and the answer is there for all to see, but the Hon. Chief Minister wants to give us tests of his mathematical knowledge and says that no party has got an absolute majority, in fact other parties got fewer votes than the Congress and therefore, the people wanted the Congress to continue in power and run the government of the State. Sir, we can also create some problems in mathematical jugglery, but I wish to submit that politics are not decided by mere arithmetical jugglery."

ఏర్పడవలసియున్న ప్రభుత్వము ఇట్టిదికాదు. వారు చేతులు కలపవలసింది కాంగ్రెసు మంత్రులతో కాదు. వారు చెప్పినమాట వారికే చదివి వినుపించుతాను.

"And therefore, constitutionally and politically, we were right in assuming that in the General Elections in the State, the people gave the verdict that they did not want the Congress Party to continue in office."

"The electorate understood that all who were returned on the non-Congress ticket either as a single party or in combination with others should take over the administration of the State from the hands of the Congress. That was the simple verdict given and we had to meet together and we met on February 12th, a day after the election programme was completed."

"Who is an opportunist? They are opportunists who have no leanings towards the creed of the party in power, who had fought it in elections, but who at the same time have joined it when it came to power, on a request sent round by the Chief Minister to get people somehow to join his party as associate members." (Applause).

కాంగ్రెసుకు వ్యతిరేకంగా ప్రజాస్వామిక ప్రభుత్వం ఏర్పడటమే ప్రజల తీర్పు అని విశ్వనాథంగారు ఆ నాడు చెప్పిన మాటలను బట్టే స్పష్టం. కాని యీ నాడు ప్రకాశంగారు, విశ్వనాథంగారు ఆ మాటలు మరచిపోయి ప్రజలకు వ్యతిరేకంగా ఏర్పడిన ప్రభుత్వంలో కలిసిపోయారు.

ప్రస్తుతము వీరు చేరిన మంత్రివర్గము ప్రజాస్వామ్య మంత్రివర్గము కాదు. పదవీ స్వామ్య ప్రభుత్వమని చెప్పవలసియుంటుంది. ఇలాంటి ప్రభుత్వము ఏర్పడటానికి గవర్నరు యీ మంత్రులు కారణమునక తప్పదు.

ఈ విధంగా పదవులకోసం పార్టీలను త్యజించి, ప్రజాస్వామికాన్ని త్యజించి, ప్రజల తీర్పును ధిక్కరించి, ఈ రోజున రాష్ట్రంలో ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయడం జరిగింది. దానికి గవర్నరూ బాధ్యులే. ఈ మంత్రివర్గంలో చేరిన, ఈ ప్రభుత్వంలో యున్నటువంటి ముఖ్యమంత్రిగారూ బాధ్యులే. ఆ రోజున శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలాచారిగారు, శ్రీ మాణిక్యవేలు నాయకరుగారిని ఇతర పార్టీనుంచి మంత్రివర్గంలోకి తీసుకున్నందుకు మనం నిరసన తెలియజేసిన విషయం అధ్యక్షులవారికి విదితమే. ఈ రోజున

ముఖ్యమంత్రిగానే, ఆ మార్గమే త్రొక్కారు. ముఖ్యమంత్రిగారు ఆయన పార్టీని విడిచిపెట్టారు. ప్రజలకు చేసిన వాగ్దానాన్ని విడనాడారు. ఏ టికెట్టుమీద ప్రజలు ఎన్నుకున్నారో ఆ టికెట్టే మార్చివేశారు. కనీసం ఆ ప్రజలకు సంజాయిషీఐనా ఇవ్వలేదు (నవ్వు). వారు ముఖ్యమంత్రిగా రావడమే సంజాయిషీ అన్నారు (నవ్వు). మీరు నన్ను ప్రజాపార్టీ టికెట్టుమీద ఎన్నుకున్నారుగదా, ఈ పరిస్థితులలో నేను రాజీనామా ఇస్తున్నాను. మళ్లీ నిలబడుతున్నాను. ఓటు ఇవ్వమని అడిగారా? లేదు. నామినేటు చేయబడిన రాజగోపాలాచారిగారు ఆరుమాసాలపాటు మంత్రిపదవిలో యుండుటకు అవకాశం ఉన్నప్పుడు, ఆయన ఎన్నికకు నిలబడలేదని దబాయించామే. కాని ఈ రోజున టికెట్టు మార్చినపుడు, మరొక పార్టీలో చేరినప్పుడు ప్రజలు ఇచ్చిన ఓటు దుర్వినియోగం చేయడం ధర్మమేనా? ప్రజాస్వామ్యమేనా? న్యాయమేనా? అని ప్రశ్నిస్తున్నాను. వారు పెద్దలు, అందులో వయోవృద్ధులు. ఆంధ్ర రాజకీయాలలో పితామహులైనవారు, ఆంధ్రుల ఏకైక నాయకులుగా పరిగణింపబడుతున్నారని మన మిత్రులు చెబుతున్నారు, వారే ఈ పని చేసారు. ఈ విధంగా ప్రకాశం పంతులుగారు తాము ప్రజలకు చేసిన వాగ్దానాలు నిలవబెట్టుకొనలేదు. ఐతే మేము ఆయనను గొప్పవారుగ గుర్తించేవారం. కాని దురదృష్టవశాత్తు నిరుడు చెప్పినమాటలు ఈ ఏడు మరచిపోయారు. మరచిపోవడమే కాకుండా త్రోసిపుచ్చారు. వారు ఒకరే కాదు. వారితోపాటు మన ఆర్థిక మంత్రిగాయున్న విశ్వనాథంగారుకూడా అదే మార్గం పట్టారు. వారి పార్టీ ఎక్కడ ఉన్నదో, ఎన్ని భాగాలుగా ఉన్నదో అంతుపట్టడంలేదు (నవ్వు, కరతాళధ్వనులు).

Mr. SPEAKER:—The Governor has addressed the House. The members can speak only about facts mentioned therein and it is not proper to speak about facts involving personalities. They cannot bring into the speech about personalities, and I say that such things are not relevant to the discussion now before the House.

Mr. SPEAKER:—గవర్నరుగారు సభ్యులకు ఉపన్యాసం యిచ్చారు. దానిలో యున్న కార్యక్రమం గురించి దానికి సంబంధించినంతవఱకూ విషయాలు మాట్లాడవచ్చునే కాని వ్యక్తిగతంగా, అదేపనిగా ఒక వ్యక్తిని గురించి మాట్లాడడం సమంజసంకాదు. రిలవెంటు కాదని మనవిచేస్తున్నాను.

Sri T. NAGI REDDI:—అది రిలవెంటవునా కాదా అనేవిషయంలో చిన్న సందేహం యున్నది. గవర్నరుగారి ఉపన్యాసం గురించి మాట్లాడాలంటే, గవర్నరు ఉపన్యాసం మీద చర్చ కాదు. గవర్నరుగారు ఈ సందర్భంలో ఇచ్చిన ఉపన్యాసం పురస్కరించుకొని, మంత్రివర్గం ఏవిధంగా నెలకొల్పబడింది అది సక్రమమైన మంత్రి వర్గము అవునా, కాదా అనేది చర్చనీయాంశము. అది చర్చించుటకు సభ సమావేశమైనదని మనం గుర్తించాలని కోరుతున్నాను. గవర్నరుగారి ఉపన్యాసం చర్చించేసందర్భంలో ఆంధ్రరాష్ట్ర పరిస్థితులు సింహావలోకనం చేయుటకు, ఈ మంత్రివర్గం సక్రమమా లేక అక్రమమా అని చర్చించడం ప్రధానోద్దేశం. కాబట్టి నేను చేసిన ఈనాటి ఉపన్యాసంలో అసందర్భం ఏమీలేదని భావిస్తున్నాను. వ్యక్తిగతంగా మాట్లాడుతున్నారంటే అది వ్యక్తిగత రాజకీయాలను గురించి కాని, వారి వ్యక్తిత్వమును గురించికాదు. ఇంతకు ముందు జరిగిన రాజకీయ చరిత్రచూచుకుంటున్నామంటే అది సక్రమమే. దాన్ని అడ్డుపెట్టటం సబబు కాదు.

The Hon. Sri T. VISWANATHAM.—శ్రీ నాగిరెడ్డిగారు చెప్పిన point ను బట్టి, ఈ సందర్భంలో ఏదైనా మాట్లాడవచ్చునని వారు చెబుతున్నారు.

Sri T. NAGI REDDI:—ఈవిధంగా చెప్పినతరువాత మీరు మాట్లాడవచ్చును. తరువాత నేను మాట్లాడుతాను.

Sri VAVILALA GOPALAKRISHNAIAH:—అయ్యా, విశ్వనాథంగారు చెప్పినదాని మీద ఒక మనవి. గవర్నరుగారు ఏ విషయాలు మాట్లాడినారో అదే చర్చ చేయాలని ఉన్నమాట నిజమే. దానిలో ఫలానా విషయం లేదుకనుక, అది చర్చించడం అనవసరం అనుటకు వీలులేదు. ప్రపంచంలో అన్నివిషయాలు మాట్లాడుటకు పార్లమెంటులో అధ్యక్షుల ఉపన్యాసం, శాసనసభలో గవర్నరు ఉపన్యాసం మీద పూర్తి అవకాశాలు ఉన్నవి. అది సాంప్రదాయం.

Mr. SPEAKER :—అందువల్లనే allow చేశాను. అప్పుడే అరగంట అయింది. దానిమీదే మాట్లాడుచున్నారు. అది వారిదృష్టికి తీసుకువచ్చాను.

Sri M. HANUMANTHA RAO:— అధ్యక్షా ! నేను పత్రికలలోనుంచి తీసుకుని మాట్లాడడంలేదు. ఎసెంబ్లీలోని చర్చలనుగురించే తీసుకుంటున్నాను. వాటిలో విషయాలే ఉల్లేఖించుచున్నాను. ఏవిధంగా మాట్లాడాలనే విషయం విశ్వనాథంగారు వివరిస్తే, ఆ పద్ధతే అనుసరిస్తున్నాం. Constitution నిరుడు వారికి అడ్డంరాలేదు. ఈయేడు అడ్డం వచ్చింది. (నవ్వు)

The Hon. Sri T. VISWANATHAM:—నేను చెప్పిన పద్ధతి గమనించలేదు. గమనించియుంటే దురదృష్టవశాత్తు వారి మార్గమే పట్టేవారం. (నవ్వు, కరతాళధ్వనులు)

Sri M. HANUMANATHA RAO:—ఆ పరిస్థితులలో ఈ ప్రభుత్వం ఏర్పడింది. ఇది ప్రజాస్వామిక ప్రభుత్వమనీ, దానిలో ముందు ఐదుగురు పంచపాండవులవలె ప్రారంభం చేశామన్నారు. తరువాత మరి ఇద్దరిని చేర్చుకున్నారు. మరికొంతకాలమైన తరువాత, ఇంకొకరు చేరారు. ఈ మంత్రివర్గానికి ఏమీ కార్యక్రమంలేదు. ఈ ప్రభుత్వానికి ఖచ్చితమైన పద్ధతులు లేవు కనుక దాన్ని వ్యతిరేకిస్తామన్న కృషీకార్ లోక్ పార్టీ నాయకులు కొద్దికాలం గడచిపోయిన తరువాత హఠాత్తుగా వచ్చి మంత్రివర్గంలో చేరారు (నవ్వు). ఇన్ని దొంతరలు, దొంతరలుగా, మజిలీలు మజిలీలుగా ఏర్పడడానికి ఈ ప్రభుత్వానికి నునిశితమైన కార్యక్రమం లేకపోవడమే కారణం. మంత్రివర్గంలో ప్రతి ఒక్కరూ తమకు తోచిన పద్ధతులలో ఉపన్యాసాలు చేస్తున్నారు. ఒకరు ఒకటి చెబితే ఇంకొకరు ఇంకొకటి చెబుతున్నారు. ఒకరు కాంగ్రెసు మంత్రివర్గమంటారు. ఇంకొకరు మిశ్రమ మంత్రివర్గం అంటారు.

ఈ విధంగా ఇటువంటి పరిస్థితుల్లో ఏర్పడిన మంత్రివర్గం ప్రజలయొక్క కార్యక్రమాన్ని, ప్రజలయొక్క తీర్పును బట్టి ఫలానా కార్యక్రమం నిర్ణయించుకొని దాన్ని

అమలుపరచడానికి ప్రజలముందు వున్నాం అని చెప్పలేదు. కొందరు ఈ మంత్రివర్గం Coalition అంటున్నారు. కొందరు కాంగ్రెసు మంత్రివర్గం అంటున్నారు. సంజీవరెడ్డిగారు అన్నారుకదా, ఏపేరు అయితేనేం నిలబడే మంత్రివర్గమేకదా అని. సరే, నామధేయం లేకుండా వున్న ప్రభుత్వమే కానివ్వండి (నవ్వు). దానికికూడా కార్యక్రమం అంటూ ఒకటి వుండాలికదా? ఏవిధంగా ప్రజలను ఉద్ధరించపోతున్నారో చెప్పలేక పోతున్నారుకదా? ఇది నూతనంగా ఏర్పడిన రాష్ట్రానికి సరిపోయిన మంత్రివర్గంకాదు. ఆంధ్రరాష్ట్రాన్ని ఈ మహానాయకులు సంపాదించి తెచ్చింది ఏమీకాదు. అందరూ ఆనాడు అడ్డుపుల్లలు వేసినవారే. పొట్టి శ్రీరాములుగారు 58 రోజులు నిరాహారదీక్ష బూనినప్పుడు ఒక ప్రకటనకూడా ఇవ్వలేని నాయకులు నేడు మంత్రివర్గంలో వున్నారు. తమ పార్టీచేత ఒక అధికార తీర్మానం చేయించలేనివారు ఇప్పుడు అధికారంలో కూర్చుని వున్నారు (Shame అని కేకలు). రాష్ట్ర ప్రజలు కోరినపద్ధతిని మంత్రివర్గం ఏర్పడలేదు. దురదృష్టవశాత్తు మనకు నియమితులైన గవర్నరుగారుకూడా అందుకు దోహదం చేయలేదు. దీన్ని ప్రజాస్వామిక పార్టీల ప్రభుత్వం అని చెప్పి ఏమీ ప్రయోజనంలేదు అని గుర్తుచేస్తున్నాను. ఇంకొక ముఖ్యవిషయం. తేలిగ్గా ప్రాంతీయ విద్వేషాలు రెచ్చగొట్టకుండా సర్దుబాటు చేయడానికి వీలైన రాజధాని సమస్యపైనే ప్రభుత్వ నాయకులు అల్లకల్లోలానికి దారితీసే నిర్ణయాలుచేశారు. ఆనాడు నేడు మంత్రిశేఖరులుగా కూర్చున్నవారే, ఎవరూ ఊహించని, కలలో అనుకోని పట్టణాన్ని రాజధానిగా చేశారు. అందరికి అనుకూలమై అందుబాటులో వున్న విజయవాడ-గుంటూరు ప్రాంతాలను నిర్ణయించి వుండవలసింది. ప్రాంతీయ విద్వేషాలు రెచ్చగొట్టకుండా అందరికి నచ్చచెప్పడానికి వీలు వుండేది. తేలిగ్గా విస్పష్టంగా తేల్చడానికి వీలైన విషయంలో అనవసరమైన గందరగోళాన్ని ప్రభుత్వంలో కూర్చున్న నాయకులు లేవతీశారు. ఈ గందరగోళంలో అసలు సమస్య మభ్యపరచడానికి మనముందు నూటిగావున్న సమస్యను క్లిష్టపరచడానికి చూస్తున్నారు. రాజధాని నిర్ణయం ఏ క్లిష్టతా లేకుండా నూటిగా నిర్ణయించడానికి ఈనాడు ఈ నాయకులకు విశాలాంధ్ర అడ్డంవస్తోంది. ఈ నాయకులు ఇదివరలో కలలో కూడా విశాలాంధ్ర పేరు తలచివుండరు. అందునిమిత్తమై వీరు ఎప్పుడూ ఎట్టి కృషి చెయ్యలేదు. కాని ఈనాడు హఠాత్తుగా విశాలాంధ్ర వూడిపడింది. విశాలాంధ్రనుకూడా ప్రకాశంగారు ముఖ్యమంత్రి అయితే బాగుంటుంది అని అంటున్నారు. అయితే మన ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ విశాలాంధ్రను గురించి ఏమని అన్నారు? విశాలాంధ్రను కోరడం సామ్రాజ్యవాదతత్వం తప్ప మరొకటి కాదు అన్నారు. ఈ నాడు విశాలాంధ్రను గురించి ఇంతగా మాట్లాడే మహానాయకులు ఆ నాడు ఆ నెహ్రూ ప్రకటనకు వ్యతిరేకంగా పల్లెత్తుమాటయినా మాట్లాడలేదేం? నాడు ఎక్కడకు పోయారు? కనుక ఆవిధంగా విశాలాంధ్ర పేరును అడ్డుపెట్టుకొని, ఈ రోజున ఏర్పడిన నూతన రాష్ట్రానికి సవ్యమైన పద్ధతిలో రాజధాని నిర్ణయం చేయకుండా, అసలు సమస్యను మభ్యపరచడానికి ప్రయత్నించడం నిరుపయోగమని మిత్రులకు మనవిచేస్తున్నాను. ఇదేవిధంగా మంత్రివర్గం వచ్చినతరువాత ఏమైనా ప్రజల కార్యక్రమాన్ని అమలుపరచడానికి ప్రయత్నం చేసిందా? రెండుసార్లో మూడుసార్లో-సరిగ్గా జ్ఞాపకంలేనందుకు క్షమించకోరుతున్నాను- Cabinet సమావేశమైనట్లుంది. ఆ సమావేశా లన్నింటిలో చర్చించిన సంగతి ప్రజల యొక్క కార్యక్రమం అమలుపరచడంగురించి కాదని, తమ మంత్రివర్గం ఎలా నిలబడుతుంది అనే విషయమే ఆలోచించారని మనవిచేస్తున్నాను. చేనేత పార్శ్రామికులగురించి

"బ్రహ్మాండంగా" ఆలోచిస్తున్నారట; కడుపు కాలి చేనేత పారిశ్రామికులు అల్లాడుతుంటే, ప్రభుత్వం ఇక్కడ "బ్రహ్మాండంగా" ఆలోచిస్తోందా? నేను వచ్చిన నియోజకవర్గంలో ఈ విషయంలో ఒక సత్యాగ్రహం జరుగుతోంది. ఈ విషయం మంత్రివర్గానికి తెలియనిదికాదు. ఫలానా పని చేయబోతున్నాం అని ఏ మంత్రి శేఖరుడైనా అక్కడికి వచ్చి చెప్పిన పాపాన పోయినాడా? అలా చెప్పివుంటే సత్యాగ్రహం ఆపివుండేవారు కదా? తిండి పెట్టమనే చేనేత పారిశ్రామికులమీద లాఠీచార్జీ చేయడం న్యాయంకాదని నేను చెపితే, మొదట మానివేసినట్లే మాని, తరువాత వాళ్లందరిని సందుల్లోకి గొందుల్లోకి లాగి లాఠీలతో తన్నడం ప్రారంభించారు. ఏమైనా తప్పువుంటే కోర్టులఎదుట పెట్టండి, విచారణ చేయించి శిక్షలు విధించేలా చేయించండి, కాని సత్యాగ్రహం చేసేవారిని హింసించడమేనా ప్రభుత్వం చేసిన బ్రహ్మాండమైన ఆలోచన? కాలే కడుపును చల్లార్చడానికి ప్రభుత్వం చేసే ఆలోచన ఏమిటి? ఇక్కడ ఒక గవర్నరు భవనానికి రెండు లక్షలు ఖర్చుపెట్టినారే? దానికి ఎంత బ్రహ్మాండమైన ఆలోచన చేసారో? ఇంత ఖర్చుపెట్టినా తృప్తిలేకపోతోంది, ఇంతా ఖర్చుపెడితే, నిన్న టీపార్టీకి పోతే సగంమంది కుర్చీలులేక నిలబడే వుండవలసివచ్చింది. (నవ్వు) అంతా air-condition చేయించారు. [Interruption:—Sound controlled కూడా.]

ఇంకా ఇదంతా చాలక మదనపల్లిలో వేసవి మకాంకు కూడా ఏర్పాట్లు జరుగుతున్నట్లు తెలుస్తోంది. ఇంతవరకు కాదని ప్రభుత్వం తరఫున ప్రకటనలు ఏమీ కాలేదు కూడా. ఇన్ని విషయాలు చర్చించడానికి ప్రభుత్వానికి అవకాశంవుంది కాని చేనేత పారిశ్రామికుల విషయంమాత్రం ప్రభుత్వం ఇంకా బ్రహ్మాండంగా ఆలోచిస్తూనేవుంది. ప్రభుత్వాన్ని support చేస్తాము అని చెప్పే వెంకటసుబ్బయ్యగారే బంజరుభూముల విషయాన్ని గవర్నరు ఉపన్యాసంలో ఉదహరించనందుకు విమర్శించటం సంతోషదాయకం. బంజరు భూముల విషయంలో, హరిజనులు ఈ భూములను 10, 15 సంవత్సరాలనుండి శ్రమపడి సాగులోనికి తీసుకువచ్చారు. ఈ సాగులోనికి తీసుకువచ్చిన భూమిని వాళ్లకు దక్కకుండా చేయడానికి మద్రాసు ప్రభుత్వం ప్రయత్నం చేస్తోంది. రాజకీయబాధితులకు భూములను ఇచ్చి, హరిజనులు వాటిని ఖాళీచేయకపోతే 144 సెక్షను అమలుజరిపి ఆ రాజకీయబాధితులను భూముల్లో ప్రవేశపెడుతూ అనేక తగాదాలకు కారణమైన ఆ G.O ను రద్దుచేయడానికి ఎంతసేపుపడుతుంది? దానికి రెండు మాసాలు కావాలా అని నేను అడుగుతున్నాను. ఎన్నో సంవత్సరాలనుండి సాగుచేసుకుంటున్న బీద హరిజనులు ఆ భూములు market value కు auction లో కొనుక్కుంటేనే ఇస్తాం అని చెబుతున్నారు. సంజీవరెడ్డిగారు ఆగ్రాలో కాంగ్రెసు కమిటీ సభలో పేదలకు భూమి లిస్తామన్న తీర్మానాన్ని బలపరిచారే? వారికి ఈ G.O. త్రోసివేయడానికి ఎంత time కావాలి అని అడుగుతున్నాను. ఇది అత్తల ప్రజలకు సంబంధించిన సమస్య. కౌలుదార్లను గురించికూడా ప్రభుత్వం చేసింది ఏమీలేదు. కౌలుదార్లను రక్షణ చేయడానికి ప్రభుత్వం ఏదో తెస్తుంది అంటున్నారు. ఇప్పుడే కౌలుదార్లకు చాలా నష్టదాయకమైన ప్రకటనలు ఎన్నో చేశారు. నిజంగా కవులుదార్లను రక్షించదలచుకుంటే ఒక ఆర్డినెన్సు పెట్టియుండవలసింది. అది చేయకపోగా వృధా ప్రకటనలు చేయటంద్వారా భూస్వాములు ముందుగానే కవులుదారుల్ని భూముల్లోంచి వెళ్లగొట్టటానికి అవకాశం యిచ్చారు.

కౌలుదారులకు రక్షణ కల్పించే విషయం గవర్నరుగారి ఉపన్యాసంలో లేకపోవడం అసంతృప్తిగా వున్నది. ఈ రెండుమాసాల్లో ఏ కార్యక్రమము జరుగలేదే. ప్రభుత్వాన్ని ఆంధ్రప్రజలు ఇక్కడున్న శాసనసభ్యులు ఏవిధంగా బలపరచగలరని అడుగుతున్నాను.

The Hon. Sri T. VISWANATHAM:— అధ్యక్షా, నాదొక personal explanation వున్నది. నా speech కూడా చదివారు. అందుకు నాకు చాలా సంతోషం. నేను ఆ speech ను మళ్లా ఎప్పుడు చదువుకోలేదు. వారు చదువబోయేసరికి తప్పుచెప్పా నేమోనని అనుకున్నాను. సరిగ్గానే అప్పుడు చెప్పాను. ఇప్పుడు సరిగ్గానే నడుచు కొన్నాను. ఆసమయంలో ప్రజాభిప్రాయం ప్రకారంగా చెప్పాను. Right view అని ఏ యే ప్రజలయొక్క అభిప్రాయంబట్టి నేను వెనుక ప్రకటనచేశానో ఆ ప్రజలే ఇప్పుడు ఆంధ్రరాష్ట్రం ఏర్పాటయిన తరువాత ఇటువైపువున్న వాళ్లను దెబ్బలాటలను సమసింప చేసికొని రాజ్యం ఏర్పాటు చేసుకోవలసినదిగా కోరుచున్నారు. ఆ సంగతి నాకు బాగుగా కనుపించడంవల్ల (నవ్వు) ప్రభుత్వంలో చేరానని మనవి చేస్తున్నాను. అంతే గాని అప్పటిది ఇప్పుడు నేను ఏమీ మరచిపోలేదు. ఎప్పుడూ ప్రజాభిప్రాయం ప్రకారమే నడుస్తున్నాను (హర్షం). పార్టీలు ఏకంకావాలని ప్రజలు కోరారు.

Mr. SPEAKER:—శ్రీ C. V. K. Rao గారు మాట్లాడుతారు. శ్రీ నాగిరెడ్డి గారికి 45 నిముషాలు allow చేశాను. తక్కిన Members కి ఒక్కొక్కరికి 15 నిముషాల చొప్పున allow చేస్తున్నాను.

Sri C. V. K. RAO:— అధ్యక్షా, శ్రీ విశ్వనాథంగారు యిచ్చినటువంటి సమాధానంబట్టి ఇప్పుడు వారియొక్క సమర్థతను—వారు చాలా సమర్థులు—ఇప్పటికి మేము తెలుసుకోగలం. మదరాసులో ప్రతిపక్షనాయకుడుగా వారున్నప్పుడు ఇంత గూఢార్థం వున్న ఉపన్యాసాన్ని వారిచ్చారని మేము అర్థంచేసుకోలేదు. వారిప్పుడిచ్చిన విశదీకరణకు వారిని అభినందించవలసి యున్నది. ఇదంతా చూస్తే సుమతీ శతకంలోని "ఎప్పటికెయ్యది ప్రస్తుత మప్పటి కామాటలాడి" అనే పద్యం బహుశః వారు వల్లించ దలచారు అనుకుంటాను. అసలు యీ ప్రథమ సమావేశంలో గవర్నరుగారి యొక్క ఉపన్యాసము చర్చించబడినప్పుడు ఈ మంత్రివర్గముయొక్క పాలసీ, కార్యక్రమమును తెలిసికొని వానిపైని సవరణలుమీద చర్చ సాగిస్తావున్నాం. అందులో ఒక పేరాలో ఒక విషయం ఆలోచించవలసివుంది.

"My Government assumed office on 1st October 1953 and though we are all rapidly settling down my address cannot be as comprehensive as it would have been..."

(At this stage the Deputy Speaker occupied the Chair amidst applause)

Sri C. V. K. RAO:— ఉపాధ్యక్షా, ఈ పేరాలోని తాత్పర్యం ఏమి టంటే ప్రభుత్వాన్ని సుస్థిరంగా ఏర్పరచుకొనే ప్రయత్నాల్లో ఉన్నాము. ఈ కార్య క్రమములో ఉండదముమూలంగా మాకింకా ఒక పాలసీ, కార్యక్రమము లేదు. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడినతోడనే ఆంధ్ర ప్రజలు దేశంలో వున్నటువంటి వాతావరణం తక్క

బడుతుందని ఎంతో ఆశించారు. నిరుద్యోగ సమస్య, తిండి సమస్య, వివిధతరగతి ప్రజలకు సంబంధించినటువంటి సమస్యలు, పరిష్కరింపబడతాయని ఎంతో ఆశించారు.

ప్రమంత్రి వర్గం—దేశానికి పూర్తిగా బాధ్యత వహించినటువంటి ఒక cabinet executive ఏర్పడ్డంతోటే మొట్టమొదట యీ సమస్యలను పరిష్కరించడానికి ముందుకు వస్తున్నాం అనేటటువంటి ప్రకటన చేసివుండాలి. అలాంటి దేమీ చేయలేదు. ప్రతిపక్షము ప్రభుత్వాన్ని విమర్శించే మొదటి విషయము—ఈ ప్రభుత్వం ప్రజా సమస్యలను పరిష్కరించుటకు చర్యలు తీసుకోలేదు. ఒక policy గాని, programme గాని లేని ప్రభుత్వం సుస్థిర ప్రభుత్వం కాజాలదు.

12-0 noon సంకుచిత ధోరణిని అవలంభించుటచే యీ ప్రభుత్వం ఆంధ్రదేశాన్ని రెండు భాగాలుగా చీలుస్తుంది. రాయలసీమ, కోస్తాజిల్లాల మధ్య భేదాలు తెస్తుంది, వైషమ్యాలు కలుగ చేస్తుంది. కాని, నిజంగా దేశంయొక్క బాధ్యతవహించి విభేదాలు తొలగించి వివిధ వర్గాలకు సంబంధించి ఉన్నటువంటి సులభమైన ఒక కార్యక్రమం వేసుకొని పని చేయవచ్చు అనే ధోరణే లేదు. అయితే ఈ కాబినెట్ ఏర్పాటైనప్పటినుంచికూడా అందరికీ యీ పరిపాలక వర్గము ప్రజాసమస్యలు గురించి ఆలోచించడము లేదనే అభిప్రాయము స్పష్టమైనది. ప్రారంభములో యీ పరిపాలన నిరంకుశ విధానంవైపు మొగ్గుతూంది. ప్రజాస్వామికంవైపు తరలించడము అపోజిషను యొక్క కర్తవ్యం అయి ఉన్నది. ప్రత్యేక రాష్ట్రం ఏర్పడిన తోడనే సుస్థిరమైనటువంటి పరిపాలన ఏర్పడు తుందని అందరూ ఆశించారు. అది అసత్యం అయిపోయింది కనుక ఏ వర్గంలో, ఏ పద్ధతిలో కాబినెట్ ఏర్పడిందనే విషయం నా ముందు మాట్లాడినటువంటి గౌరవ సభ్యులు వివరించారు.

న్యాయంగా ఆలోచిస్తే ఒక మెజారిటీ పార్టీ నాయకుడు ప్రభుత్వం ఏర్పరచాలి లేక ఒక మిశ్రమ గ్రూపు ఏర్పడి దాని నాయకుడు ఎన్నికై ఆయన తన కాబినెటు ఏర్పరచవలసి ఉంటుంది. మన రాష్ట్రంలో యీ సూత్రము అమలు పెట్టబడిందా ? లేదు. కేంద్రంలో అధికారములోఉన్నపార్టీ constitutional పద్ధతులనుకూడ సరకుచేయకుండా తన అనుకూల గ్రూపుల కలయికతో ప్రభుత్వాన్ని ఏర్పరచుకొంది. ప్రజలయొక్క మన స్తత్వాలు అర్థం కనుక చేసుకొంటే ఈ నాడు ఆంధ్రదేశంలో ఏర్పడినటువంటి ప్రథమ కాబినెట్ ఈ దేశంలో ప్రజాస్వామిక సూత్రాలను విడచిపెట్టింది అని చెప్పాలి. ఎంతమంది సభ్యులు ఈ గ్రూపుకు వెనకాల ఉన్నారో స్పష్టం అవాలి. ఈ మంత్రి వర్గానికి యీ శాసన సభలో ఉన్నటువంటి సభ్యుల మెజారిటీ బలం ఉన్న దని కూడా ఋజువు కావాలి. ఈ ప్రాథమిక విషయంకూడా వీరు గుర్తించినట్లు కనబడదు. ఇవన్నీ అంచనా వేసుకొని ఈ అపోజిషన్ బెంచినుంచి విమర్శ చేయవలసి వస్తున్నది. కనుక ఇటువంటి నిరంకుశవర్గ పరిపాలన ఆంధ్రరాష్ట్రంలో ఏర్పడింది. ఇక్కడ ఇవన్నీ [illegible] గవర్నరుగారి ఉపన్యాసముద్వారా తమ పాలసీని మంత్రులు తెలియచెప్పి ఉండవలసింది. గత ఒకటిన్నర నెలలలో రాష్ట్రంలో ఈ పరిపాలనా వర్గం ఏర్పడినప్పటి నుండి [illegible] ఒక నిలకడైనటువంటి ఉపన్యాసం మంత్రులు [illegible]లేదు. దేశంలో ముఖ్యంగా ఆహార సమస్య క్లిష్టతరంగా ఉంది. దానికి ఈ ప్రభుత్వం [illegible] ఇవ్వలేదు. ఈ భూమి సమస్యా సంస్కరణల విషయంలో [illegible] ఏర్పడి ఉన్నది. వీరు ప్రజా[illegible]

ఇవ్వడం విషయంలో యీ పాలకవర్గము అనుకూల ధోరణి అవలంబించాలని కోరుచున్నాను. ఈనాడు దేశంలో ఉన్న నిరుద్యోగాన్ని బీదతనాన్ని రూపుమాపవలసి ఉంది. దీనికి కారణం జమీందారులు, పాశ్చాత్య పెట్టుబడిదారులు. ఈ ప్రభుత్వము వీరిని బలపరుస్తే ఆంధ్ర దేశము అభివృద్ధికాదు. ఆంధ్రరాష్ట్రంలో ఈ కౌలుదార్ల రక్షణకు శాసనం తీసుకురాని పక్షంలో ఎక్కువగా ఈ రైతాంగంయొక్క కష్టాలు, చిక్కులు ఎక్కువౌతాయని గుర్తించాలి. వెంటనే కౌలుదార్లరక్షణకు ఒక చట్టం తీసుకురావలసి ఉన్నది. అది తీసుకురాలేదు సరికదా, దీనిమూలంగా దేశంలో ఉన్నటువంటి కౌలుదారులకు లాభంలేదు సరికదా, ఆంధ్రదేశంలో ఉన్నటువంటి భూస్వాములకు ఒక పెద్ద భరణం ఇవ్వవలసివచ్చేపరిస్థితికి మాత్రం తీసుకువచ్చారు. ఈ పంథాలో పరిపాలనావర్గంతో సహకరించడంవల్ల చాలా చిక్కులను తెచ్చిపెడుతున్నదని నేను అభిప్రాయపడుతున్నాను. కాని, ఇక గోదావరివరదవల్ల తీవ్రమైనటువంటి నష్టం రెండు జిల్లాల్లో ఏర్పడినపుడు కొంతమంది మంత్రులు ఆ ప్రాంతాలకు వచ్చి అక్కడి శాసన సభ్యులనుండి వారి అనుభవాన్ని తీసుకొని ఎటువంటి సహాయం చేయవలసి ఉండేది కోరవలసింది. చాటున, మాటున అన్నీ బాగానే ఉన్నాయని, తగినంత సహాయం చేశామని ఆత్మసంతృప్తి చెందడము వాస్తవిక పరిస్థితికి విరుద్ధము. పూర్తిగా దెబ్బతిని క్షామపరిస్థితులు ఏర్పడి ఉన్న ఈ ప్రాంతాల్లో వ్యవసాయకూలీలకు, బీదరైతాంగానికి ఎక్కువసాయము యీ ప్రభుత్వము చెయ్యాలి. ఈ ప్రభుత్వము వెంటనే కౌలుదారీ రక్షణ చట్టము, బీద రైతాంగము అప్పులబాధ నివారణ చట్టము, నిరుద్యోగసహాయచట్టము తీసుకురావాలని కోరుచున్నాను. ఎటువంటి జాగుచెయ్యకుండా ప్రొహిబిషను రద్దుచెయ్యాలని కూడా కోరుచున్నాను. ఈ కనీస కార్యక్రమమును పూనుకుంటే ఆంధ్రప్రజలకు కొంతమేలు కలుగుతుందని నా అభిప్రాయము.

Sri K. RAJAGOPALA RAO:—ఉపాధ్యక్షా ! సభయొక్క మర్యాదను 12-10 p.m.
పాటించడంకోసం నేను లేచి చెప్తున్నాను. ఇపుడు ఇక్కడ సభలో చర్చలు జరుగుచున్నపుడు అందరికన్నా ఎక్కువ బాధ్యతగలవారు Treasury benches లో మంత్రులు ఎవ్వరూలేరు. అది శాసనసభా మర్యాదలకు భంగం అని నేను మనవిచేస్తున్నాను.

The Hon. Sri P. THIMMA REDDI:— ఈ సభలో జరిగే విషయాలను, మిగతా మంత్రులందరికీ తెలుపడానికి నేను ఒక్కడిని చాలును.

DEPUTY SPEAKER:—గౌరవసభ్యులు, మంత్రులు, శాసనసభా మర్యాదలను పురస్కరించుకొని లోపలకువచ్చి కూర్చోవాలని కోరుతున్నాను.

Sri K. GOVINDA RAO:—ఉపాధ్యక్షా ! ఈ చర్చ సందర్భంలో ప్రజలు 12-11 p.m.
ఎదుర్కొనేటటువంటి ప్రధాన సమస్యలను సభా దృష్టికి తీసుకురాదలచాను. ముఖ్యంగా మా విశాఖపట్టణం జిల్లానుండి వచ్చిన మంత్రిగారు శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు మంత్రి అయినతరువాత ఏవిధంగా రైతాంగానికి సంస్కరణలు చేయబోతున్నారని రైతాంగం ఎదురుచూస్తూ వచ్చారు. అట్టి పరిస్థితులలో, వారు మంత్రియైన కొద్ది రోజులలోనే ఒక ముఖ్యమైన ప్రకటన చేశారు. కౌలుచేసుకుంటున్న రైతాంగానికి 10 సంవత్సరాలపాటు కౌలుహక్కులు కల్గిస్తున్నామని ప్రకటనచేశారు. తరువాత కొద్దిరోజులకే ఆ ప్రకటనలో నున్న పద్ధతిని అమలుజరుపుటలేదని ముఖ్యమంత్రిగారు statement యివ్వడం జరిగింది.

ఇది చాలా ముఖ్యమైన విషయం. కాబట్టి దీనినిగురించి ప్రభుత్వం శ్రద్ధతీసుకోవాలి. విశాఖపట్టణంలోవున్న కౌలుదార్లను విపరీతమైన కష్టా లెదుర్కొన్నవి. అచ్చట కొన్ని ప్రాంతాల్లో ఎకరానికి రూ. 500-600 రూ||లు చెల్లించుతున్నారు. ఇంక ఈనాములలో వున్న రైతులు చాలా కష్టనష్టాలకు గురౌతున్నారు. ఈనాముల రద్దు చట్టం ఎప్పుడు వస్తుందో తెలియదు. ఈ కౌలు విధానంలో కొంతయినా రక్షణ కల్గిస్తారని కౌలుదారులు ఆశిస్తున్నారు. అయితే దురదృష్టవశాత్తూ విశ్వనాథంగారు ప్రకటనచేసిన కొద్దిరోజులలోనే అదేమీ లేదని మరల ఒక ప్రకటన చేయడం, ఆ ప్రాంతాలలో చాలా తీవ్రమైన పరిణామాలకు కారణమైంది. ప్రకటన చేస్తున్నప్పుడు అది ఒక నిజమైన, నిజాయితీతో ఆలోచించి ప్రకటన చేయకపోవడంవల్ల అనేకమంది రైతాంగమునకు నష్టానికి కారణమైనది. ఈ విధమైనటువంటిది ordinance రూపంలో వచ్చివుంటే బాగుండేదని నా అభిప్రాయం. నిజమైనటువంటివి కాక నిజాయితీ లేనటువంటి ప్రకటనలు ఈ మంత్రులు చేస్తే ప్రజానీకం కష్టనష్టాలకు గురవుతారు. ఇప్పుడు జరిగిందేమిటంటే, విశ్వనాథంగారు ప్రకటన చేసినవెంటనే, కౌలుదారీచట్టం అమలులోకి వస్తుందనే భయంతో అచ్చటి ఈనాందారులు, భూస్వాములు భూములలోవున్న కౌలు రైతులను అందరినీ భూములనుండి తొలగమని, కోర్టులలోకూడా వారు ఫిర్యాదు చేయడానికికూడా ఆధారం లేకుండా చేస్తున్నారు. మరొకవైపు December నోటీసు లివ్వబోతున్నారు. వారందరినీ తీవ్ర ప్రమాదానికి గురిచేయడం శోచనీయమైన విషయం. ఒక శాసనాన్ని రైతాంగానికి అనుకూలంగా ordinance రూపంలో అమలు జరిపితే ఇటువంటి ప్రమాద పరిస్థితులు వచ్చివుండేవి కావు. ఇటువంటి విషయాలలో విశ్వనాథంగారికి, వారి మంత్రివర్గంవారికి, ఏ నిర్ణయం లేకుండా, ఒక పద్ధతిలేకుండా బాధ్యతారహితంగా ఏ ప్రకటన గూడా చేయవద్దని మనవి చేస్తున్నాను. అట్లు చేయడంవల్ల దేశంలో తీవ్రమైన పరిస్థితులకు దోహదమిచ్చిన వారవుతారని నేను చెపుతున్నాను. ఇక గౌతు లచ్చన్నగారు లోగడ మంత్రికాకపూర్వం, ఈనాములను రద్దుచేసి, రైతులకు సౌకర్యములు కల్పించటం అవసరమని అంటూ వచ్చారు. అయితే వారు యీనాడు మంత్రివర్గంలోనికి వచ్చారు. వారు తమ మాటలను మరచిపోలేదనే నా నమ్మకం. భూస్వాములక్రింద నలిగిపోయే ఈనాం రైతుల రక్షణకు ఒక ordinance ప్రవేశపెట్టవలయునని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

అట్టి సత్వర చర్యలు తీసుకొనకపోతే అచ్చట పరిస్థితులు తీవ్రరూపందాల్చి రైతాంగమునకు తీరని కష్టనష్టాలు వాటిల్లుతాయని మనవిచేస్తున్నాను. ఈనాడున్న జమీందారీ రైతుచట్టంలో అనేకములైన లోపము లున్నవని పదేపదే చెప్పనక్కరలేదు. ఇది సభ్యులందరికీ తెలిసియున్న విషయమే. అందులోని లోపాలను చూపడానికి ఒక దృష్టాంతం చెప్పదలచాను. టెక్కలి తాలూకాలో తర్లా ఎస్టేటులో రైతులవద్ద లోగడ ఎస్టేట్‌దారులు 1360, 61, 62 ఫసలీలకు శిస్తులు వసూలుచేస్తే, మళ్లీ Rent reduction officials వచ్చి మరొకసారి శిస్తులు వసూలు చేస్తున్నారు. ఇది చాలా అన్యాయం. రెవిన్యూ మంత్రిగారు శిస్తు రెండు సార్లు వసూలు చేయకూడదని అధికారులకు వెంటనే ఉత్తర్వులు జారీ చేయాలి. ఈ రెండవసారి శిస్తు వసూలుచేయడంగురించి రైతులు పై అధికారులకు తెలియజేస్తే వాటిని చెవినిబెట్టడంలేదు. ఈ విషయమై ప్రభుత్వంవారు ముఖ్యంగా ఆలోచించవలసి యున్నది. జమీందారీ రైతుల సౌకర్యములగురించి, రెండుసారులు శిస్తులు వేయటం విషయంలో ప్రభుత్వం తగు విచారణ జరిపి, వాటినిగురించి అధికారులకు ఉత్త

రువులు జారీచేయాలని, జమీందారీ రైతుచట్టంలో కొన్ని మార్పులు తీసుకురావలయునని మనవి చేస్తున్నాను. లేకపోయినట్లయితే అచ్చటి రైతాంగం చాలా కష్టాలుపడక తప్పదు. అందుచేత ఈ సమస్యను పరిష్కరించుటకు యీ ప్రభుత్వంవారు, తగిన చర్యలను తీసుకోవలయునని కోరుతున్నాను.

మనరాష్ట్రం ఏర్పడి నూతన ప్రభుత్వం ఏర్పడిన మీదటకూడా పాతపద్ధతులలోనే నడుస్తున్నది. మార్పుకు ఎట్టి ప్రయత్నమూ కనపడదు. లంచగొండితనం రూపుమాపాలనేమాటలు అంతా చెబుతున్నప్పటికి, ఆచరణలో ఏమీ జరుగుటలేదు. విశాఖపట్టణం మెంటల్ హాస్పిటల్ సూపరింటెండెంటును ఈ మధ్యను అరెస్టు చేయడం జరిగినది. ఆయన ఒక్కొక్కరి దగ్గర 250 రూపాయలు లంచాలు తీసుకొంటున్నాడు, అని చెప్పి ఆయనమీద complaint చేయబడి ఇప్పటికి దాదాపు 1½ మాసములైనది. అక్కడున్న local M. L. A., మరియు ఇంకా అనేకమంది సాక్ష్యము ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నప్పటికిని, ఈమధ్యవరకు ఆయనను suspend చేయకపోవడానికి ఏమిటి కారణము? వారిమీద పెట్టిన ఆరోపణలు నిజమని ఋజువైనప్పుడు, వారిని వెంటనే తప్పనిసరిగా suspend చేయవలసియుండెను. ఆ తరువాత విచారణ చేయవలసియుండెను. అయినా యింతవరకు ఏ చర్య తీసుకోకుండా ఉన్నారు. ఈ రోజువరకు అసలు చార్జి షీటైనా పెట్టలేదని తెలుస్తున్నది. అంతేకాకుండా ఈ మధ్యన మంత్రి విశ్వనాధంగారు విశాఖపట్టణం వచ్చారు. అప్పుడు ఈ సంగతి వారి దృష్టికి తీసుకురాబడింది. వారితో ఈ విషయంలో సాక్ష్యమున్నదనీ, కేసు రుజావు అయినప్పటికికూడ ప్రభుత్వం, అధికారులు ఏమి చర్య తీసుకోనకుండా ఉన్నారని తెలుపగా, ఆయన ఆశ్చర్యకరమైనటువంటి జవాబు ఇచ్చినట్లు పత్రికలద్వారా తెలుస్తున్నది. ఈ రకంగా లంచాలు తీసుకుంటున్నాడని ఒక ఉద్యోగిని శిక్షించవలసివస్తే అందరు ఉద్యోగస్థులు చాలామట్టుకు లంచాలు తీసుకొంటూనే యుంటున్నందున అందరిని శిక్షించవలసియుంటుందని సమాధాన మిచ్చారని తెలుస్తున్నది. ఆ విధంగా పత్రికలలో ప్రకటింపబడినది నిజమే అయితే, ఇది చాలా విపరీతమైనటువంటి బాధ్యతా రహితమైన వైఖరి అని చెప్పక తప్పదు. మంత్రులు ఈ రకమైన దృక్పథం తీసుకొంటే, లంచగొండితనాన్ని రూపుమాపుతామని వారు చెప్పే మాటలు, ప్రకటనలు అన్నీ బూటకములుతప్ప మరేమీగావు. ఈ విధంగా ప్రభుత్వం లంచగొండి అధికారులను వదలివేసినట్లైతే, అధికారవర్గము లంచగొండితనానికి ఎక్కువ దోహదం ఇచ్చినట్లవుతుంది. ఏ అధికారి, ఉద్యోగస్థుడుకూడ, ఎవరికి ఎంత మాత్రము భయపడకుండా ఉండే పరిస్థితి ఏర్పడుతుంది. కాబట్టి నేను చెప్పునది, ప్రభుత్వం ప్రజలకు సహాయకరంగా పెద్ద పెద్ద పనులు చేయలేకపోయినప్పటికి, ఉద్యోగస్థులలో, అధికారవర్గంలో ఇటువంటి లంచగొండితనమును తొలగించేటటువంటి చిన్న చిన్న కార్యములుచేసి ప్రజలకు తోడ్పడవచ్చుగదా! అంతమాత్రమైన ప్రభుత్వం ఎందుకు చేయకూడదని అడుగుతున్నాను. ప్రభుత్వం ఇటువంటి దృక్పథం అవలంబించకపోతే, ఆంధ్రరాష్ట్రం సంపాదించుకొనిన తరువాతకూడ మన స్థితిగతులు బాగుపడతాయనేటటువంటి నమ్మకంకూడ కలుగడానికి ఏమాత్రం ఆస్కారం లేదని చెప్పుచున్నాను.

తరువాత ఇంకొక ముఖ్యమైన విషయాన్ని మనవిచేస్తున్నాను. చెఱకు ఉత్పత్తిదారులు ఉన్నారు. వారు ఏ విధముగా ఇదివరకు నానా ఇబ్బందులకు నష్టాలకు గురి అగుచుండినది అందరికి తెలుసును. వారి చెఱకుకు ఏమాత్రం గిట్టుబాటుకాని ధర నిర్ణయించి

[Sri K. Govinda Rao] [26 th November 1953

రైతాంగాన్ని విపరీతంగా బాధించారు. ఇదంతా లోగడ రాజాజీ ప్రభుత్వంలో జరుగు చుండినదే. కాని ఈ రోజునకూడ వారి పరిస్థితి ఏమి అభివృద్ధి కాకుండా యున్నది. ఈ సందర్భంలో ఇప్పుడు ఇక్కడ లచ్చన్నగారు లేరు. ఉండియుంటే బాగుండేది. ఇంకా ఆ files open చేశారో లేదో తెలియదు. ఏమైనప్పటికి, ఈ చెఱకును ఉత్పత్తిదారులు sugar factory యజమానులకు సప్లై చేసే విషయంలో వీ రిద్దరికి 'సిస్మా' ఫార్ముల అనేటటువంటి ఒక ఒడంబడిక చేయబడింది. దాని ప్రకారం గత సంవత్సరం సప్లయి చేసిన చెఱకుకు టన్ను ఒకటికి 5 రూపాయలు నుంచి 12 రూపాయలవరకు ఫ్యాక్టరీ యజమాని చెఱకుకు ఇవ్వవలసియుంటుంది. ఈ payment కూడ నవంబరు 30 వ తేదీలోనే చేయ వలసిందని గవర్నమెంటు ఉత్తర్వు చేసియున్నది. కాని ఫ్యాక్టరీ యజమానులు, ఆ విధంగా payment చేయుటకు పూనుకోనడంలేదు. ఎక్కడో 1, 2 ఫ్యాక్టరీలలో 'సిస్మా' ఫార్ములా ప్రకారం payment చేసినప్పటికిని, ఎక్కువ ఫ్యాక్టరీలలో అది అమలుపరచడానికి నిరాకరిస్తున్నారు. ఇటువంటి పరిస్థితులలో, చెఱకు ఉత్పత్తిదారులు చాలా కష్టాలకు గురికావలసియుంటుంది. కనుక నేను చెప్పునది ఏమిటంటే, ప్రభుత్వము పెద్ద పెద్ద సంస్కరణలు ఏవి చేయకపోయినప్పటికి ఏమి ఖర్చులేకుండా చేయగలిగిన ఇటువంటి చిన్నచిన్న పనులు రైతులకు ప్రజలకు సహాయకరంగా ఉండేటటువంటి పనులు చేయవచ్చును. ఇప్పుడు ఈ చెఱకు ఉత్పత్తిదారులకును యజమానులకును ఈ సిస్మా ఫార్ములా ఏర్పాటు చేశారు. దీనిని యజమానులు సరిగా అనుసరించడంలేదు. కనుక దీనిని సక్రమంగా అమలుజరిపేటట్లు ఒక ordinance రూపంలో statutory గా ఈ ఒడంబడికను ఖాయపరచి రైతులకు సహాయం చేయవచ్చును. ప్రజలకు రైతులకు సహాయ కరమైన ఇటువంటి చిన్నచిన్న పనులు ఎన్నో చేయవచ్చును.

ఇతర విషయాలుకూడ ఉన్నవి. అవన్నీ ఇప్పుడు విపులంగా మాట్లాడడానికి వీలు లేదు. మరల అవకాశము వచ్చినపుడు తెలియజేస్తాను.

* SRI G. NAGABHUSHANAM:—Mr. Deputy Speaker, Sir, I thank you very much for giving me an opportunity to speak on this occasion. I support the motion of thanks moved by Sri Audinarayana Reddi. Sir, I must thank the Andhra Government for the benefit conferred by them in my constituency, the Rayadrug taluk, which was formerly in Bellary district but now transferred and brought within the jurisdiction of Anantapur district. The Andhra State Government have ordered extension of electricity to several villages in my constituency. That has proved very useful in helping the villagers to raise food and improving their economic condition. Japan has made considerable progress in this direction on account of extension of electricity. It has been borne out by the experts who went to Japan and recently returned from there. They have made mention of it in their report submitted to Government; and they have declared that Japan has attained a high degree of progress on account of extension of electricity to rural areas. In the same manner the Andhra State Government have done with regard to the Rayadrug taluk.

With reference to the weavers of Rayadrug taluk, they have been carrying on sari production for several generations. The saris are partly made of cotton yarn, silk yarn and lace yarn; and they are costly ones. For the last more than one year there is severe unemployment,

26th November 1953] [Sri G. Nagabhushanam]

as the saris manufactured are not sold and the stocks have been increasing daily. I may also state that the weaving industry prevails in other parts of this State and the same unemployment is persisitng, which is not a thing peculiar to Rayadrug taluk alone. As silk saris manufactured by weavers are not being sold, a large stock of goods is stocked in every house with the result that there is severe unemployment and suffering. I submitted a memorandum to the Andhra State Government very recently, and I am very glad to say that the Anantapur district authorities have untertaken investigation into the matter. I am glad to note that they are trying to do what is possible under the circumstances. It is not possible to take immediate steps to remove unemployment and afford complete relief but I am glad to note that steps are being taken in that direction to improve the miserable lot of the weavers.

So far as the weavers' problem is concerned, it is a thing which has been before the country for the last two years. I respectfully ask what the members of the Opposition have done to alleviate the sufferings of the weavers or what parctical steps they have suggested to the Government. I submit that so far they have not submitted any practical suggestions to solve that problem except what has been suggested by Sri C. Rajagopalachari. Sri Rajagopalachari's suggestion has come to stay; and no one else till this day has come forward with any practical solution. He, with his wonderful imagination, (Opposition laughter) has come forward with the suggestion that coloured saris and dhotis must be reserved for the weavers. My friends on the other side laugh. I do not think any of my friends on the other side have made any practical suggestion either in public or in the Press to solve this problem of weavers. On the other hand, the Bombay Government, after Sri Rajagopalachari has made his suggestion, passed a resolution ratifying his suggestion. Sri J. C. Kumarappa, the great authority on rural economics has also supported this suggestion. Therefore, I say to my friends it is all easy to attack Government and say that this thing was not done, or that thing was not done. My friends are very fond of attacking others without realising their weakness. Let me take this opportunity of bringing home to them the basic principle of Hindu Dharma, "Know thyself before you point out the weakness in others. If you are only perfect, then point out the weakness in others." The Opposition want freedom of speech for themselves but they are not willing to give that freedom of speech to others. I am now reading from the Constitution of India. It has been framed four years ago by our great thinkers, politicians and statesmen. This Consitution of India has been accepted by great jurists in the world, as well as by others, as one of the great achievements after attainment of freedom. The aim of the Government is to secure to all its citizens :

"JUSTICE, Social, economic and political;

LIBERTY of thought, expression, belief, faith and worship;

EQUALITY of status and of opportunity; and to promote among them all

FRATERNITY assuring the dignity of the individual and the unity of the Nation."

[Sri G. Nagabhushanam] [26 th November 1953

This is the aim of our Government in India. May I ask my friends who are sitting on the opposite side what the Constitution of Soviet Russia is? I sent a requisition to the Legislature Library here in Kurnool but I am told no book on that subject is available. I may tell my friends that in Russia there is only one party that carries on the Government, and no other party has got any voice to state the needs of the Russian people. I ask, Sir, where is freedom of speech in Russia? I ask my friends to consider carefully what kind of State is that. I submit, Sir, it is a totalitarian State, in which there is no freedom of thought, or freedom of expression or freedom of worship. But here, in India, we stand for freedom of thought, expression and worship, and it is also a secular State.

Sri K. RAJAGOPALA RAO:—On a point of order, Sir, రష్యానుగురించి, ఆదేశముయొక్క రాజ్యాంగ విధానమును, శాసనసభ విధానమును, తదితర విషయాలను సరిగా తెలుసుకోకుండా, వాటినిగురించి చర్చించడం సరికాదనే విషయాన్ని తమదృష్టికి తెస్తున్నాను.

* Sri G. NAGABHUSHANAM :—I submit to my esteemed friends that if they think that I am talking of the constitutions of other countries without understanding them, then it is a mistaken idea, for which I cannot be held responsible. (Opposition cries of Oh!) I cannot understand why my friends are very sensitive when anything is said about Soviet Russia. If they believe in freedom of speech let them not interrupt me; but, on the other hand, allow me to have the same freedom of speech which they enjoy. I appeal to them to have patience, to allow other members to have their say. Let them practise patience and show tolerance to others. Let them not think that we are all a set of bad people to exploit this country. It is because there is liberty and freedom of expression in this country that my friends are here. Sir, I know my friends will heckle me and will not allow me to speak. If they do so, they are misusing their right of freedom of expression given to them under the Constitution.

Sri PILLALAMARRI VENKATESWARLU :— Sir, on a point of order. Freedom of expression ను misuse చేశామని వీరు అనడంద్వారా, Speaker దీనిని అనగా ఈ misuse ను allow చేశాడని అందువలన ఆయన సరిగా ప్రవర్తించలేదనే ఒక అపనింద, తమపై వేసినట్లు ఉంది. మీయొక్క శాసనసభయొక్క గౌరవాన్ని రక్షించడం సభ్యుల కర్తవ్యం గనుక, ఆమాటలను ఉపసంహరించుకోవలసిందిగా కోరమని మనవి చేస్తున్నాను.

DEPUTY SPEAKER:—శాసనసభా సంస్కృతీ సాంప్రదాయాలను మన్నించేటటువంటి బాధ్యత ప్రతి శాసన సభ్యునిమీద, ప్రతి అధికారిమీద ఉన్నదనే విషయాన్ని గురించి అందరు సక్రమంగా వ్యవహరించవలసిందిగా కోరుతున్నాను. (Laughter)

* Sri G. NAGABHUSHANAM :— Mr. Deputy Speaker, Sir, the fact that a large number of Members from the Opposition side are raising points of order and preventing me, if I may be permitted to say so, from speaking, is itself proof positive that I should not speak anything about Communism. While they are permitted to speak anything

they like about the Congress, they will not allow other members to speak about Communism in Russia. I shall say here what the Congress has achieved, within a short time of six years. It has achieved great unity in India. Mr. Lincoln took 13 years to bring about unity in America after big wars; Mr. Bismark took 18 years to effect unity in Germany; our Sardar Patel took only one year and eleven months to create a united India by non-violent methods. He has liquidated 520 Native Princes in such a short time. We have now a united India under one flag, one railway and with one post office and currency. I say this, because it seems there is a mistaken impression that Congress has not achieved anything for India. Further, the Congress Government has taken up the Damodar Valley Project and several other projects and most of them are about to be completed. In its greatness, Damodar Valley Project stands next to the Tennesse Valley Scheme. We have spent 36 crores for Tungabhadra and completed the Bhawani Reservoir Scheme and the Malampuzha Project; and we have several such projects on hand. So, we have not misused money; on the other hand, every effort has been made to promote the welfare of India.

Coming to our Andhra State, the Government could not do much due to several adverse circumstances, and particularly because of the short time at their disposal. No Government can carry out any scheme in a short time, unless they have the material ready on hand. No Government can carry on without proper records and other conveniences. Naturally it is these impediments that are obstructing progress. Thank you, Sir.

Sri M. HANUMANTHA RAO:—నాగభూషణంగారు తమ ఉపన్యాస స్వేచ్ఛను మేము అడ్డగించామంటున్నారు. అది పొరపాటు. వారు రష్యా కాన్‌స్టిట్యూషనును చదువలేదని చెబుతూనే దానిమీద వ్యాఖ్యానించినందుకే మేము ఆక్షేపణ తెలిపాము.

Sri T. POTHA RAJU:—ఉపాధ్యక్షా! నామిత్రుడు హనుమంతరావుగారు, నాగభూషణంగారు చెప్పినసంగతులు కాదన్న విషయాన్ని నాకు అనవసరమని తోచినా నేను ఆ విషయములో చిన్న సలహామాత్రము యివ్వదలచుకున్నాను. అది యేమిటంటే రష్యను కాన్‌స్టిట్యూషనులో వున్న విషయాలు చదివిచూచినట్లయితే, మన ఇండియన్ కాన్‌స్టిట్యూషనుకున్నూ, దానికిన్నీ వున్న భేదము అర్థమవుతుంది. రష్యను కాన్‌స్టిట్యూషనులోనివి ఒకటి రెండు ముఖ్యమైన అంశములు సభ్యులదృష్టికి తేదలచుకున్నాను. ముఖ్యముగా ఒకవిషయము జ్ఞాపకము చేస్తున్నాను. రష్యను కాన్‌స్టిట్యూషను ప్రకారముకూడా శాసనసభ్యులను ఎన్నుకునే హక్కు ఉన్నది. అంతేకాకుండ ఏవాడైతే ప్రజల ననుసరించి, ఏ యే ఆశయాలకొరకు ఎన్నుకోబడతారో, ఆ యా ఆశయసిద్ధికొరకై యతడు సభ్యుడుగా ఉండగలడు. ఆ శాసనసభ్యుడు ఆ పార్టీని విడచి వేరే పార్టీలో చేరినట్లయితే అతనిని తొలగించుటకు ప్రజలకు హక్కువున్నది. అలాంటిహక్కు మన కాన్‌స్టిట్యూషనులో ప్రజలకు కలుగజేయలేదు. ఐనప్పటికిని అక్కడ యిన్ని పార్టీలు లేవు. ఇక్కడ మన ఇండియాలో ప్రజల ఆర్థిక వ్యవస్థకు అక్కడ ప్రజల ఆర్థిక వ్యవస్థకు చాలా తేడావుంది. మన కాన్‌స్టిట్యూషనులో ఒకపార్టీ టిక్కెట్టుమీద ఎన్నికై వారియొక్క ప్రయోజనములకొరకు మరియొకపార్టీలో చేరడమువల్ల వారు అనేక విమర్శలకు గురి అవుతున్నారు. రష్యను కాన్‌స్టిట్యూషనులోవుండే విషయాలను అర్థముచేసుకో 12-40 p.m.

[Sri T. Potha Raju] [26th November 1953

కుండా విమర్శలు చేయడము సబబుగాదని అంటున్నాను. గవర్నరుగారి ఉపన్యాసమునకు సంబంధించిన అభినందన తీర్మానాన్ని నేను అభినందించలేను. కాని నా మాదిరిగా మాట్లాడినమిత్రులు అనేక కారణాలు యివాళ చెప్పారుగాని ఆ కారణాలను నేను ఆమోదించుట లేదు. నేను చెప్పేది ఏమిటంటే గవర్నరు యిచ్చిన ఉపన్యాసములో అతి ప్రధానమైన విషయాలు ఈ నాడు తన ప్రసంగములో ప్రస్తావించలేదు. అందులో ముఖ్యముగా ఆంధ్రదేశాన్ని ఎంతో కలవరపెడుతున్న ప్రధాన అంశాలు ఏవికూడ అందులో రాలేదు. గవర్నరు ఉపన్యాసము పైనవున్న మంత్రివర్గము policy వ్యక్తపరచబడి ఉన్నది. ఈలాంటిరోజున యీ మంత్రివర్గము ఎలా పనిచేస్తున్నదీ కాంగ్రెసుపార్టీ, కమ్యూనిష్టు పార్టీ, యితరపార్టీలు ఒకప్రత్యేకత, పార్టీయొక్క దృక్పథము ముందుకు తీసుకురాలేదు. కాని ఇప్పుడు కనబడుతున్న విషయము ఏమిటంటే దేశములో నిరుద్యోగులుగా, పట్టణములలోను, గ్రామములలోను నూటికి తొంభైమంది ఉంటూ వున్నారు. ఇది చాల ప్రధానమైన సమస్య.

Sri Ch. S. R. V. P. MURTHY RAJU:—On a Point of Order, Sir. శాసనసభలో సభ్యులు పత్రికలు చదవటమనేది శాసనసభా సాంప్రదాయాలకు విరుద్ధము కాదా?

DEPUTY SPEAKER:— ఈ విషయము Point of Order క్రింద రాదు.

Sri T. POTHA RAJU:—దేశములోని నిరుద్యోగ సమస్య విషయము గవర్నరు ప్రసంగములో ఉదహరించబడలేదు. అందుచేత నానాటికి ఈ సమస్య ప్రజలలో పెరిగిపోతున్నది. ప్రస్తుత పరిస్థితులనుబట్టి యిది తీవ్రమైన ఘట్టముగా కనిపించుచున్నది. ఆంధ్రదేశములో నాయకులలోను చాల ఆందోళన చేస్తున్నటువంటి యితర సమస్యలు గూడ ఉన్నవి. వీటిలో Prohibition అనేది ఒకటి. ఈ Prohibition అనేది ప్రజలు వద్దు అంటున్నారు. అన్ని పక్షాలవారున్నూ యీ Prohibition విధానమును ప్రతిఘటించుచున్నారు. ప్రజాభ్యుదయమునకు యిది నిరోధకముగా నున్నది. ఈ విధానమువల్ల దేశములో ఎన్నో లక్షలాది జనము నిరుద్యోగులైనారు. గవర్నమెంటువారు వీరికి పని కల్పించటానికి ఏవిధంగాను పూనుకోలేదు. దాదాపు 5 కోట్లరూపాయల ఆదాయమును కోల్పోయే విధానమును ప్రభుత్వము అవలంబించుతున్నది. ఈ Prohibition యొక్క ఉపయోగమేమిటో ప్రభుత్వము కనిపెట్టినట్లులేదు. గవర్నరుగారి ప్రసంగములో దీన్ని గురించి యిసుమంతయును ప్రసంగించబడలేదు. రెండవది, ప్రజలను కలవరపరుస్తున్న ప్రాథమిక విద్యావిధానమును గురించి గవర్నరుగారి ప్రసంగములో రాలేదు. ఈ విషయములో శ్రీ రాజగోపాలాచారిగారి ప్రత్యేకత ఒకటి మన రాష్ట్రములో ప్రవేశపెట్టినారు. దీని వల్ల ప్రజలలో విద్యకు దౌర్బల్యము ఏర్పడగల సావకాశము కలుగుతున్నది. దీనిని గురించి ప్రజలలో యీనాడు చాల పెద్ద ఆందోళన లేవదీశారు. దీని విషయము గవర్నరుగారి ప్రసంగములో కించిత్తుకూడ చెప్పబడలేదు. ఈ నూతన విద్యావిధానమును గురించి మంత్రివర్గముయొక్క policy ఏమిటో వెల్లడిచేయబడలేదు. ఇదిగాక, మరొక విషయము చెబుతున్నాను. మన శాసనసభలో పార్లమెంటరీ సాంప్రదాయాలను గురించి చాల తీవ్రముగా మాట్లాడుతూ వుంటారు. అయితే యీ ప్రజాస్వామిక విధానము సక్రమమైన పద్ధతిలో తీసుకురావాలంటే జిల్లాబోర్డులు, మునిసిపాలిటీల administration విషయములో మార్పుకావలసియున్నది. దీని విషయము ప్రత్యేకించి చెప్పవక్కరలేదు.

ఈ administration ను decentralize చేయవలసిన అవసరము ఎంతయినా వున్నది. ఈ విషయములో చట్టమును సరియైన పద్ధతిలో సవరించాల్సి ఉన్నది. ఈ విషయంకూడ గవర్నరు ఉపన్యాసములో రాలేదు. ఇంకనూ అనేక యితరసమస్యలు వున్నవి. మనము ఉమ్మడి మదరాసు రాష్ట్రములో వున్నప్పుడు మనరాష్ట్రములో పట్నాలు గ్రామములు అభివృద్ధి కొంచెముగూడ చేసుకోలేకపోయాము. పట్నముల అభివృద్ధికి తమిళ నాడు ఎక్కువ ప్రాధాన్యత యిచ్చియున్నది. తమిళనాడులో వున్న పట్నాలు మన తెలుగు రాష్ట్రములో లేవు. ఎంతగా ఆందోళన చేసినను వుమ్మడి రాష్ట్రములో మన శాసనసభ్యులు మంత్రిపదవిలో వున్నప్పటికిని కించిత్ మాత్రముగూడ జోక్యము కలుగ చేసుకుని మనరాష్ట్రములోని పట్నాలను అభివృద్ధికి తీసికునిరాలేకపోయినారు. ఇప్పుడు మనకు వేరేరాష్ట్రము వచ్చినదికనుక ఇప్పటికైనా మనపట్టణముల నభివృద్ధి చేసుకొనుటకు యేర్పడగల స్కీములను గురించి ఏమాత్రము గవర్నరు ప్రసంగములో లేదు. ఏదో విజయవాడ అభివృద్ధి చెందినదంటే దానికి డ్రైనేజిస్కీముకూడ ఎప్పుడో వుమ్మడి మదరాసు రాష్ట్రములో వున్నప్పుడు 70 లక్షల రూపాయలు శాంక్షను చేసివున్నారేగాని యింతవరకు యీ డ్రైనేజిస్కీము విషయమై యే మాత్రమును పేర్కొనబడలేదు. మునిసిపాలిటీవారు యీ స్కీమును అమలుపరచాలని సిద్ధముగావుండినను, గవర్నమెంటువారు ఇంకను ఆర్డర్సును పాసుచేయకుండ వుండటమనేది అర్థముకాకుండా యున్నది. Water supply స్కీము చూస్తే ఉమ్మడి మదరాసు రాష్ట్రములో మనమున్నంత కాలము యీ విషయము మనశాసనసభ టేబిలుమీదికి రానేలేదు. పట్టణముల అభివృద్ధికొరకు ప్రభుత్వము వారు తీసుకొనే చర్య యేమిటి? ప్రజలకు మనము ఏవిధంగా నచ్చచెప్పగలము? ప్రజాభ్యుదయానికి మనమంతా కృషిచేస్తేగదా, యీ ప్రభుత్వము ప్రజాస్వామ్య ప్రభుత్వమనిపించుకుంటుంది. అందుచేత పట్టణముల అభివృద్ధిని గురించి యీ ప్రభుత్వము యేలాంటి చర్యలు తీసికోబోతున్నదో నేను ఒక అభిప్రాయమునకు రాలేకవున్నాను.

మరొక విషయము చెప్పుతున్నాను. నేడో రేపో ఒక ఎడ్జర్నమెంటు తీర్మానము రావచ్చునని అనుకుంటున్నాను. ఉదాహరణకు విజయవాడలో పేదజనులు వేసుకున్న సుమారు 1500 పాకలకు రివెన్యూ డిపార్టుమెంటు eviction notice లు జారీ చేసింది. ఈ 1500 వందల పాకలలోను 6, 7 వేల మంది జనాభా వుంటున్నారు. ఏదో విధంగా జీవించే ప్రజలకు యిళ్లు యిరుకులేకుండా పోవడానికి అవకాశము వచ్చింది. ఇది ప్రభుత్వం దృష్టిలో వున్నది. ఈ విషయములో constructive గా నేను ఒక సలహా యివ్వదలచుకున్నాను. ఈ జనాభా సంతటికీ యిండ్లవసతి కలిగించవలసిన బాధ్యత ప్రభుత్వముపైన వున్నది. ఇందుకుగాను జిల్లాలో అనేకమంది ఎంతో భూమిని ఆక్రమించుకుని అధిక లాభాలకోసము అమ్ముకోవటానికి కాచుకుని ఉన్నారు. ఇటువంటి భూమిని ప్రభుత్వము త్వరలో acquire చేసి యీ పేదప్రజలకు యిండ్లవసతి కలిగించక పోతే ప్రజలలో మరింత అలజడి కలుగనున్నది. ఖాళీస్థలములు ఎక్కడైనావుండి దరఖాస్తు పెట్టుకుంటే దానిని ప్రభుత్వమువారు పాటించుటలేదు. కాబట్టి ప్రభుత్వము యీ పేదవాళ్లకు ఇండ్లవసతి కలిగించుటకు ప్రయత్నము చేస్తుందని ఆశిస్తున్నాను.

వారికి ఇళ్లవసతులు కల్గించే ప్రయత్నాలు ప్రభుత్వం చేయడంలేదు. వెనుకబడిన ప్రజలూ, మాల మాదిగలు హరిజనులూ పడే ఇబ్బందులు ఇంతా అంతా కాదు. ఆసుపత్రులూ, నీటివసతులూ మొదలైన సదుపాయాలు కల్గించే ప్రయత్నం ప్రభుత్వం

చేస్తోందా అంటే అదీ కనబడడంలేదు. ఇంకొక ముఖ్యవిషయం చెప్పదలచుకున్నాను. గవర్నరుగారి ఉపన్యాసంలో ప్రాజెక్టులు, పంచవర్ష ప్రణాళిక కలిపివేశామంటున్నారు. ప్రభుత్వం 50 కోట్ల రూపాయలు ప్రత్యేకించబడ్డాయని కృష్ణానదిపై రోడ్డు రెగ్యులేటరు కూడా అందులో చేర్చబడిందని అంటున్నారు. అక్కడ ఉన్న ఇరిగేషన్ ఆఫీసర్లు P. W. D. ఆఫీసర్ల, conference జరపడం జరిగింది. వారు ఒక సలహా యిచ్చారు. వెంటనే 10 లక్షల రూపాయలు sanction చేస్తే డిసెంబరులోగా పని ప్రారంభించుటకు వీలవుతుందని చెప్పారు. Central Government ఇంకా sanction చేయలేదని తెలుస్తోంది. ఈ విషయంలో ప్రభుత్వం Central Government sanction కోసం కనీస చర్య తీసుకోవడం డిసెంబరులోగా పని ప్రారంభించడం అవసరమని తెలిసికూడా పదిలక్షలైనా సరే sanction చెయ్యడానికి సిద్ధంగా ఉన్నామని గవర్నరుగారు చెప్పక పోవడంవల్ల, ఈ సంవత్సరం పని ప్రారంభమవుతుందనే ఆశ రైతాంగానికీ ప్రజలకూ లేకుండా పోతోంది. మంత్రివర్గం ఉంటుందా లేదా అనే విషయంలోకూడా విశ్వాసం లేకుండాపోతోంది. అందువల్ల గవర్నరుగారి ప్రసంగం అభినందించలేకుండా పోతున్నాం. మంత్రివర్గం సరియైన మార్గాన నడుచుటకు ప్రయత్నంచేస్తే, కమ్యూనిస్టుపార్టీ సభ్యులైనంత మాత్రంచేత మంచిచేసినా, చెడ్డచేసినా విమర్శిస్తారని ఆరోపిస్తున్నారు. మంచిచేస్తే సంతోషిస్తాం. చెడ్డచేస్తే గట్టిగా విమర్శిస్తాం. మంచిఐనా, చెడ్డఐనా సరే ప్రభుత్వం మీద గడ్డలువేయడం ధర్మంకాదంటే, మే మట్టి సహాయం చేయలేం. ముందు మాట్లాడిన మిత్రుడు చెప్పినట్లు ఈ ప్రభుత్వం చట్టబద్ధమైనదే. కమ్యూనిస్టుపార్టీది దౌర్జన్యమార్గం, హింసాయుతమార్గం. మేము శాంతంగా మార్పులు తీసుకువస్తామని ప్రభుత్వం అంటారు. నా అనుభవంలో ఏది వీలైతే ఆ మార్గం అనుసరిస్తారు. అక్కడ ఒకరకమైన మార్గం, ఇక్కడ ఇంకొరకమైన మార్గం అనుసరిస్తారు. ఇక్కడ వచ్చేసరికి కాంగ్రెసురాదు, కమ్యూనిస్టులు వస్తారని ప్రజలనుకుంటే ఆ పని జరగలేదు. ఏ రాజ్యాంగచట్టమైతే బ్రహ్మాండమైనదీ, మంచిదీ అని అనుకుంటున్నారో ఆ చట్టానికే వక్రమార్గాలు చూపించి ప్రజాస్వామ్యమునకు విరుద్ధమైన ప్రభుత్వం స్థాపించడం జరిగింది. ఏ రకంగా ప్రభుత్వం మారాలనే విషయం వారి చేతులలో యున్నది. కాంగ్రెసు ప్రభుత్వం మాకు వద్దు అని ప్రజలు ఇతర పక్షాలను ఎన్నుకొన్నా వారిని అధికారంలోకి రానివ్వకుండా యుండే పద్ధతి అనుసరించబడుతోంది. ఉంటే కాంగ్రెసు గవర్నమెంటు ఉండాలి, లేకపోతే శాసనసభే లేకుండాపోవాలి—ఈ విధానం అనుసరించే ప్రభుత్వం అధికారంలోకివచ్చి కూర్చుంది. ప్రభుత్వమే అన్ని సమస్యలూ పరిష్కారం చేస్తుందనే విషయంలో ప్రతి పక్షంలోయున్న మాకు విశ్వాసంలేదు. ఇదివరకు ఆ పక్షంలోయున్నవారు కొంతమంది ఇప్పుడు ప్రతిపక్షంలో యున్నారు. ప్రభుత్వ విధానాలు అంధత్వంతోనూ, కమ్యూనిస్టు వ్యతిరేకత్వంతోనూ అమలుజరపకుండా, ఆంధ్రదేశంలో నిర్మాణయుక్తంగా పనిచేయాలి. దానికి ప్రభుత్వం తీసుకొనే చర్యలు ప్రజాస్వామ్యం కాపాడేరీతిగా ఉన్నాయా అంటే అవి అనుమానాస్పదం. అందువల్ల మిత్రులు ఈ విషయాలు ఆలోచించాలి. ప్రభుత్వం సక్రమమైన మార్గాన నడుచునట్లు చేయవలసిన బాధ్యత మన అందరిమీద ఉన్నది. లేకపోతే గద్దెమీదనుంచి దింపే బాధ్యతకూడా మనమీదే యున్నదని విజ్ఞప్తిచేస్తూ విరమిస్తున్నాను.

1-0 p.m. **DEPUTY SPEAKER**:—సభ 3 గంటలకు వాయిదా వేస్తున్నాను. తిరిగి 3 గంటలకు సమావేశమవుతాం.

26th November 1953]

After Lunch 3 p. m.

Mr. SPEAKER:— ప్రొద్దున Governor గారి ఎడ్రసుమీద general discussion అయింది. ఈ పూట amendments తీసుకుంటాము. కాబట్టి అన్ని amendments move చేసిన తరువాత, వాటిమీద general discussion అయిన తరువాత ప్రతి ఒక amendment మీద yes or no తెలుసుకుంటాము. Now we proceed with the amendments.

The Hon. Sri T. PRAKASAM:—Sir, I would like to . . .

Hon. Members :—తెలుగులో చెప్పండి.

The Hon. Sri T. PRAKASAM:—జ్ఞాపకంచేశారు. Thanks (నవ్వు) తమరు ఇప్పుడు amendments తీసుకుంటాం అన్నారు. ఇవి amendments అవునా అనే ప్రశ్న మీరు ముందుగా solve చేయవలసి వున్నది. Governor Address మీద ఇటువంటి amendments తీసుకురావడం వాటిని amendments అని చెప్పడం, వాటిని move చేయడం చాలావిపరీతమైన సంగతి కాని సామాన్యమైన కార్యక్రమం కాదు. గవర్నరు Address King's Address వంటిది. దానిమీద amendments పెట్టరు. ఇక్కడ ఎందుకు పెట్టారో కాని, ఎక్కడా పెట్టరు. ఈ విషయం point out చేస్తే గ్రహిస్తారనుకుంటాను.

Sri T. NAGI REDDI:—ఏవిధమైన amendments పెట్టకూడదనడం సరికాదు. సాధారణంగా మా 1½ సంవత్సరాల అనుభవంబట్టి, సాంప్రదాయం బట్టి—

The Hon. Sri T. PRAKASAM:—సాంప్రదాయ మేమీలేదు.

Sri T. NAGI REDDI:—సాంప్రదాయం ప్రకారం ఇక్కడ దాదాపు 300 amendments move చేశారు. సభ్యులు move చేసినప్పుడు కొన్ని సవరణలను ఉపసంహరించుకోడానికి బహుశా ఒప్పుకోవచ్చును. కాబట్టి సవరణలను move చేయించవలెనని కోరుచున్నాను.

Sri C. V. K. RAO:—మన రూల్సులో Rule 5 (2) వుంది. అది చదువుతున్నాను. "Any member may give notice of amendments to such a motion by way of adding additional words at the end of the Address but not otherwise before such time as may be fixed by the Speaker," ఈ రూలు ప్రకారం గవర్నరు ప్రసంగానికి ఇచ్చే Thanksgiving motion కు amendments ఇచ్చే అధికారం ప్రతి member కు వుంది. దాన్ని పురస్కరించుకొని సవరణలు తీసుకు రావడం జరిగింది.

Sri VAVILALA GOPALAKRISHNIAH:—ముఖ్యమంత్రిగారు చెప్పిన అభ్యంతరం ఏమిటో బోధపడటం లేదు. గవర్నరుగారు address చేయడం దానిమీద అభినందనలకోసం ప్రభుత్వ పక్షంనుంచి తీర్మానం రావడం, దానిమీద సవరణలు అందరు సభ్యులు పంపించడం, దానిమీద చర్చజరగడం సాంప్రదాయ సిద్ధంగా వస్తున్న సంగతి. ఇప్పుడు అసలు సవరణలు ప్రతిపాదించడానికే scope లేదనడం సరికాదు. సర్వాధికారం వున్న శాసనసభాసభ్యులమైన మాకు ఆ అధికారం వుందని భావిస్తున్నాము.

moratorium for a certain period over debts due to the money lenders, Government and Cooperative Banks,

(*b*) that on the other hand the Government are collecting loans in Cuddapah District from peasants who are still struggling in distress and who are being compelled to sell away their harvest at low prices,

(*c*) that the loss caused by heavy and continuous rains and the destruction caused by pests have not been taken into consideration and no steps have been taken to counteract the same,

(*d*) that the Government have decided to enforce Prohibition more rigorously in spite of the fact that it is a total failure,

(*e*) that the Government have decided not to take up Gandikota, Thungabhadra High Level and Remodelling of Kurnool Cuddapah canal projects by spending State Finance which could be secured through the abolition of Prohibition,

(*f*) that the Government have not made any effort to keep up the prices of commercial crops like groundnut, onion, etc;

(*g*) that the Government have not revised the policy of the previous Government of the composite Madras State regarding the holding of elections to the Second Class Panchayats by open method of voting,

(*h*) that the new modified scheme of elementary education is being implemented though it was voted by the Assembly of the Composite Madras State,

(*i*) that the prolonged traffic dislocation caused by the recent floods in the Pennar river in Cuddapah District which can be prevented by constructing a bridge at Chennur and by widening and raising the level of the causeway on the Proddutur - Yerraguntla road, is not mentioned,

(*j*) that preventive measures have not been undertaken during the out-break of cholera in Cuddapah District,

(*k*) that the Government have not decided to carry on the administration of the State in the language of the people, for which the people of Andhra have fought since long time,

(*l*) that the Government have closed almost all the gruel centres in villages where large numbers of weavers lived,

(*m*) that no steps have been taken to protect the ryots from the eviction of the inamdar in the inam villages,

(*n*) that no attention is paid to the just demands of the Non-Gazetted Officers and no steps are taken to put down curruption, nepotism and red-tapism."

The amendment was duly seconded.

Sri G. C. KONDAYYA:—Sir, I move: Add the following at the end: "Since the major river valley projects will definitely take much time and since the tanks and channels in the province are almost defunct,

minor irrigation projects and improvements to the tanks, dams, channels etc., which will become useful even under any major scheme, will at once be taken up to be built all over the province especially in non-delta and backward areas."

The amendment was duly seconded.

Sri K. MALAKONDAYYA:—Sir, I move: Add the following at the end : "ప్రస్తుతం మన రాష్ట్రములో నిరుద్యోగ సమస్య అతిప్రధానమైన సమస్యగా ఉన్నది. దాని పరిష్కారమునకు ఒక స్పష్టమైన సూచన యివ్వనందుకు నేను విచారించుచున్నాను."

The amendment was duly seconded.

Sri K. MALAKONDAYYA:—Sir, I move: Add the following at the end: "నాన్‌గజిటెడ్ ఉద్యోగస్థులకు జీతాలు పెంచడంలో మొదలగు సమస్యల మీద వారికి సౌకర్యాలను కలిగించుటకు హామీ యివ్వనందుకు విచారించుచున్నాను."

The amendment was duly seconded.

Sri K. MALAKONDAYYA:—Sir, I move: Add the following at the end : "వ్యవసాయ కూలీలకు కనీస కూలి రేటు నిర్ణయించడంలో పేర్కొనకపోవడం విచారించుచున్నాను."

The amendment was duly seconded.

Sri K. MALAKONDAYYA:—Sir, I move: Add the following at the end: "బంజరు భూములు పేదలకు యివ్వడంలో ప్రస్తుతం వేలం వేయుట మొదలగు ప్రతిబంధకాలను తొలగించుటకు తగిన హామీని పేర్కొనక పోవడం, అందుకు విచారించుచున్నాను."

The amendment was duly seconded.

Sri K. VENKATA KURMI NAIDU:—Sir, I move: Add the following at the end : "ఆంధ్ర ప్రజానీకములో, అత్యధికము బంజరు భూములను, భూమి లేని రైతు కూలీలకు, హరిజనులకు వెంటనే ప్రత్యేకించి యిచ్చుటకు తగిన ఏర్పాట్లు చేయమని ప్రభుత్వమును యీ సభవారు కోరుచున్నారు."

The amendment was duly seconded.

Sri K. VENKATA KURMI NAIDU:—Sir, I move: Add the following at the end: "ఆంధ్ర ప్రజానీకముయొక్క ముఖ్యోద్దేశమేమనగా:- చిన్నచిన్న నీటి వనరులను ప్రభుత్వము తక్షణం జరిపించేటట్లు యేర్పాటు చేయవలెనని యీ సభవారు కోరుచున్నారు."

The amendment was duly seconded.

Sri K. RAJAGOPALA RAO:—Sir, I move: Add the following at the end : "కాని ప్రభుత్వ వ్యవహారాలన్నీ తెలుగులో జరిపించడంపట్ల ప్రభుత్వ విధాన మేమిటో స్పష్టంగా వ్యక్తీకరించనందుకు, ఆంధ్ర భాషాభివృద్ధికై ప్రభుత్వం తీసుకోనున్న చర్యల్ని తెలియజేయనందుకు, తమ ప్రసంగాన్ని ఆంధ్రభాషలోకి అనువదించి అందించనందుకూ ఆంధ్ర శాసనసభ విచారం వెలిబుచ్చుతున్నది."

The amendment was duly seconded.

[26th November 1953

Sri K. RAJAGOPALA RAO:—Sir, I move: Add the following at the end: "కాని, చాలాకాలంగా జైళ్లలో మ్రగ్గుతున్న కమ్యూనిస్టు ఖైదీలను రాజకీయ ఖైదీలను విడుదలచేయాలని ఆంధ్రప్రజలు చేస్తున్న ఆందోళనపట్ల ప్రభుత్వ విధానాన్ని వ్యక్తంచేసే అంశం గవర్నరుగారి ప్రసంగంలో లేనందుకు మాత్రం ఆంధ్ర శాసనసభ విచారపడుతున్నది."

The amendment was duly seconded.

Sri N. V. L. NARASIMHA RAO:—Sir, I move : Add the following at the end : "చేనేత పారిశ్రామికుల సర్వసేనానియు, ఆంధ్ర శాసనసభా సభ్య మహాశయులు నగు శ్రీ ప్రగడ కోటయ్యగారిని గవర్నమెంటువారు బంధవిముక్తుని చేసినను, వారి అనుచరులైన వారందరినికూడ ఆ విధముగా వదలుటకు శ్రీ గవర్నరుగారికి గవర్నమెంటువారు సలహా నియ్యకపోవుట శోచనీయము."

The amendment was duly seconded.

Sri N. V. L. NARASIMHA RAO:—Sir, I move : Add the following at the end : "మద్రాసులో నిలవ నీడలేకుండా చేయబడినను అక్కడనే యింకా ఆఫీసులు వుంచి తరలింపు మార్గమును ఉదాసీనముగా ఆలోచించుట శ్రీ గవర్నరుగారి ఉపన్యాసములో యిదమిద్ధమని సూచన లేకపోవుట శోచనీయము."

The amendment was duly seconded.

Sri N. V. L. NARASIMHA RAO:—Sir, I move: Add the following at the end : "శ్రీ గవర్నరుగారి ఉపన్యాసములో హైకోర్టు యొక్క స్థల నిర్ణయము సూచించకపోవుట శోచనీయము."

The amendment was duly seconded.

Sri SAKA VENKATA RAO:—Sir, I move: Add the following at the end : "ప్రొహిబిషన్ విఫలమైనదని తెలిసికూడా దానిని ఉపసంహరించకయింకా వేలాది కల్లుగీత కార్మికులను నిరుద్యోగులుగా చేయుచూ, వారి భృతికి యితర వృత్తులు చూపకుండా కడకు విఫలమైన తర్వాతకూడ మొండిగా దానిని ఉపసంహరించకుండా యుండుటను గురించి విచారించవలసివస్తుంది."

The amendment was duly seconded.

Sri SAKA VENKATA RAO:—Sir, I move: Add the following at the end: "పొరంకి ప్రాజెక్టు దిగువ వేలాది యెకరాల భూమిని అనేక సంవత్సరాలుగా సాగుచేసుకుంటున్న పేద ప్రజానీకానికి పట్టాలివ్వకుండా వేరే రూపంలో ధనికులకే కట్టబెట్టుటకు చేస్తున్న ప్లానుల గురించి విచారించవలసివస్తుంది."

The amendment was duly seconded.

Sri SAKA VENKATA RAO:—Sir, I move: Add the following at the end: "గోదావరి వరద బాధితులకు ప్రభుత్వం యిచ్చిన సహాయం అసలే చాలీచాలనిదిగా యుండుటయేగాక, అదికూడ సక్రమమైన పద్ధతులలో పంపకం చేయక ప్రభుత్వ ఆఫీసర్లు ఆసాములకు ప్రజా [illegible] యిచ్చి పంపకం చేయించి

నందున అది సరిగా ప్రజలకు అందుటలేదని యెన్నో రిపోర్టులు చేసినా వాటిని పట్టించు కోనందుననూ, ప్రభుత్వం యొక్క అసమర్థతను గురించి విచారించవలసి వస్తుంది."

The amendment was duly seconded.

Sri ALLURI VENKATARAMA RAJU :—Sir, I move : Add the following at the end : "తూర్పు గోదావరిజిల్లాలోని వరదనష్టం భూములకు (గండ్లు పడ్డచోట) నష్టపరిహారం యివ్వకపోగా మరెప్పుడూ సాగుకు పనికిరాకుండా గండ్లు పూడ్చుటకు త్రవ్వివేసినారు. దీనికి తక్షణం నష్టపరిహారంగా ప్రభుత్వం లంక భూమినిగాని డబ్బుగాని ఇవ్వాలి."

The amendment was duly seconded.

Sri ALLURI VENKATARAMA RAJU :—Sir. I move : Add the following at the end : "ప్రభుత్వం లంకలు పాడుపడ్డవారికి పూర్తి రెమిషను ఇచ్చుటగాని, కోతబడ్డలంకలు తిరిగి పాటకు పెట్టి సహాయపడాలి."

The amendment was duly seconded.

Sri ALLURI VENKATARAMA RAJU :—Sir, I move : Add the following at the end : "మరమ్మతు చెయ్యబోయే ఏటిగట్లులు లేబరు సొసైటీలకు మాత్రమే ఇవ్వాలి."

The amendment was duly seconded.

Sri GARAPATI SATYANARAYANA :— Sir I move: Add the following at the end : "కాని శివాయిజమా బంజరు భూములను గత 10, 15 సంవత్సరాలుగా సాగుచేయుచున్న వ్యవసాయ కూలీలు, బీదరైతులకు పట్టాలు యివ్వవలయునని పేర్కొనబడనందుకు విచారించుచున్నాను."

The amendment was duly seconded.

Sri GARAPATI SATYANARAYANA :—Sir, I move : Add the following at the end : "కాని చాలకాలంగా నివేశన స్థలముకొరకు ఆందోళన చేయుచూ డిపాజిటు కూడ కట్టిననూ హరిజనులకు నివేశన స్థలములను యిప్పించుటలో ప్రభుత్వం విఫలతచెందినందుకు విచారించుచున్నాను."

The amendment was duly seconded.

Sri GARAPATI SATYANARAYANA :—Sir, I move : Add the following at the end : "కాని పశ్చిమగోదావరి-కృష్ణా జిల్లాల మధ్యగల కొల్లేరులో అదనంగా 30 వేల ఎకరాలు సాగుకు అనుకూలించే ఉప్పుటేరుకు రెగ్యులేటరులు నిర్మించుటలో ప్రభుత్వం పూనకొనందుకు విచారించుచున్నాను."

The amendment was duly seconded.

Sri G. JOSEPH:—Sir, I move: Add the following at the end: "కాని శివాయిజమా బంజరుభూములను గత 10, 15 సంవత్సరాలుగా సాగుచేయుచున్న వ్యవసాయ కూలీలకు పట్టాలు యివ్వవలయునని పేర్కొనబడనందుకు విచారించుచున్నాను."

The amendment was duly seconded.

Sri G. JOSEPH:—Sir, I move: Add the following at the end: "కాని వ్యవసాయ కూలీలు అనేక సంవత్సరాలుగా సాగుచేసిన బంజరుభూములు రాజకీయ బాధితుల దురాక్రమణనుండి తిరిగి తొలగించి మొదట సాగుచేసిన కూలీలకే యిస్తామని చెప్పకపోవడం గురించి విచారించుచున్నాను."

The amendment was duly seconded.

Sri D. LAKSHMAIAH:—Sir, I move: Add the following at the end: "ఆంధ్రరాష్ట్ర స్వాతంత్ర్య విప్లవ పోరాటములో అసువులుబాసిన విప్లవ వీరుల కుటుంబాలకు నష్టపరిహారమును యిచ్చుటను గురించి ఉదహరించనందుకు విచారమును తెలియజేయడమైనది."

The amendment was duly seconded.

Sri D. LAKSHMAIAH:—Sir, I move: Add the following at the end: "భారత స్వాతంత్ర్య విప్లవ పోరాటములో పాల్గొని అసువులుబాసిన విప్లవ వీరుల కుటుంబాలకు నష్టపరిహారము యిచ్చుటను గురించి ఉదహరింపనందుకు విచారమును తెలియజేయడమైనది."

The amendment was duly seconded.

Sri D. LAKSHMAIAH:—Sir, I move: Add the following at the end: "భారత స్వాతంత్ర్య విప్లవ పోరాటములలో పాల్గొన్నవారిపై ప్రభుత్వంవారు పెట్టిన కేసుల్లో శిక్షలువేసిన కేసులున్నూ, కోర్టులలో జరుగుతున్న కేసులు తీసివేయడమును గురించి ఉదహరించనందుకు విచారమును తెలియజేస్తున్నాను."

The amendment was duly seconded.

Sri D. LAKSHMAIAH:—Sir, I move: Add the following at the end: "సాగుకు అనుకూలమైన ఫారెస్టు బంజరు భూములున్నూ, రెవిన్యూ బంజరు భూములున్నూ వుచితముగా బీదలకు సాగుచేసికొనుటకు యిచ్చుటను గురించి ఉదహరించనందుకు నా విచారమును తెలియజేయుచున్నాను."

The amendment was duly seconded.

Sri D. LAKSHMAIAH:—Sir, I move: Add the following at the end: "ఆంధ్రరాష్ట్రములో వ్యాపారపు పంట అయిన పొగాకును రైతులు ఎక్కువగా వుత్పత్తిజేసి విడుదలగాక రైతాంగం పడు యిబ్బందులను గురించి సరుకును యితర దేశములకు యెగుమతిజేసి అమ్మకంజేసి రైతుల కష్టములను తీర్చు మార్గము ఉదహరించనందుకు నా విచారమును తెలియజేయుచున్నాను."

The amendment was duly seconded.

Sri D. LAKSHMAIAH:—Sir, I move: Add the following at the end: "అత్యధిక సంఖ్యాకులు విద్య లేకపోవుటవలన పొగాకు చుట్ట చట్ట నిబంధనల వలన రైతులు పొందుచున్న కష్టములను నివారించు పద్ధతులను గురించి వుదహరించనందుకు విచారమును తెలియజేయడమైనది."

The amendment was duly seconded.

26th November 1953]

Sri D. LAKSHMAIAH:—Sir, I move: Add the following at the end: "మద్యపాననిషేధ చట్టమువలన ప్రజానీకం అభివృద్ధిచెందుటకు బదులు కష్టనష్టములకు గురి అవుచున్న మద్యపాన నిషేధచట్టమును రద్దుచేయుటకుగాను ఉపక్రమించనందుకు విచారమును తెలియజేయవలెను."

The amendment was duly seconded.

Sri B. LAKSHMINARASA RAJU:—Sir, I move: Add the following at the end: "కాపురముండుటకు ఇండ్లులేని హరిజనులకు ఉచితముగా ఇండ్ల స్థలములు మంజూరుచేయుటలో తగిన శ్రద్ధ చేయనందుకున్నా."

The amendment was duly seconded.

Sri B. LAKSHMINARASA RAJU:—Sir, I move: Add the following at the end: "సుమారు 15 సంవత్సరములనుండి భూమి లేని రైతులు సాగుచేసుకొనుచున్న బంజరు భూములకు పట్టాలు ఇచ్చుటకు నిర్ణయం చేయనందుకున్నా ప్రభుత్వముయొక్క అసమర్థతనుగురించి విచారించవలసివస్తోంది."

The amendment was duly seconded.

Sri R. VENATAJAGGA RAO:—Sir, I move: Add the following at the end: "పేరా నెంబరు 2, 5, 6, 8, మరియు 13 లో ఉపయోగించిన "My Government" కు బదులు (స్థానములో) "Andhra Government"—అను సవరణను చేర్చవలెను."

The amendment was duly seconded.

Sri R. VENKATAJAGGA RAO:—Sir, I move: Add the following at the end: "10 వ పేరా ఆఖరున ఈ క్రింది సవరణ చేర్చవలెను. 'మద్యపాన నిషేధ చట్టమును' ఆంధ్ర ప్రభుత్వము రద్దుచేయ నిశ్చయించింది."

The amendment was duly seconded.

Sri R. VENKATAJAGGA RAO:—Sir, I move: Add the following at the end: "వ్యవసాయ కూలీల కనీస వేతనములు నిర్ణయించుచూ ఒక చట్టమును ప్రవేశపెట్టుటకు ఆంధ్ర ప్రభుత్వము నిశ్చయించింది."

The amendment was duly seconded.

Sri M. KUNE RAO:—Sir, I move: Add the following at the end: "యిందులో వరద నివారణోపాయములు యెత్తలేదు. శబరినది ఆనకట్ట, నది గట్లు బలంగా పెంచమని యింజనీర్ల సలహా, అమలుపరుస్తామని వుండాలి."

The amendment was duly seconded.

Sri M. KUNE RAO:—Sir, I move: Add the following at the end: "అధిక ఆహారపంట స్కీములు యెలా నిరుపయోగమైనదీ కనీసం ముందుకైనా మైనరు యిరిగేషను వర్కుల్ని తప్పక పూర్తిచేస్తామని తెలియచేసి వుండవలసింది."

The amendment was duly seconded.

[26th November 1953

Sri M. KUNE RAO·—Sir I move: Add the following at the end. "విద్యుచ్ఛక్తి స్కీములు ఆకస్మికంగా లోగడ ప్రభుత్వం అప్పుడపట్ల నిరసన, రైతాంగమునకు వాటిల్లిన నష్టాలను నివారణోపాయములు, మరల యెలా అమలుపర్చేది ప్రసంగములో తీసుకురావలసినది."

The amendment was duly seconded.

Sri M. KUNE RAO :—Sir, I move. Add the following at the end· "అటవీ శాఖ ప్రయివేటు చట్టం యెందువల్ల వుంచాల్సింది కాస్త వివరించి వుండాల్సింది."

The amendment was duly seconded.

Sri B. SANKARAYYA:—Sir, I move: Add the following at the end: "గౌరవనీయులైన గవర్నరుగారు, తమ ఉపన్యాసములో ఆంధ్రదేశ అభివృద్ధికి అత్యవసరమైన ఆంధ్ర పారిశ్రామిక అభివృద్ధినిగురించి చెప్పనందుకు విచారిస్తున్నాను."

The amendment was duly seconded.

Sri B. SANKARAYYA:—Sir, I move: Add the following at the end: "గౌరవనీయులైన గవర్నరుగారు తమ ఉపన్యాసములో, బీదలైన వ్యవసాయకూలీలు రైతులు సాగుచేసుకొంటున్న బంజరు భూములను పట్టాలకు ఇచ్చే విషయము తీసుకు రానందుకు విచారిస్తున్నాను."

The amendment was duly seconded.

Sri B. SANKARAYYA:—Sir, I move: Add the following at the end: "గౌరవనీయులైన గవర్నరుగారు తమ ఉపన్యాసములో వందల, వేల యకరాలను కష్టించి సాగుచేసుకొంటున్న ధర్మాదాయ భూములలో, సదరు సాగుదార్ల హక్కులను పేర్కొనందులకు విచారిస్తున్నాను."

The amendment was duly seconded.

Sri B. SANKARAYYA:—Sir, I move: Add the following at the end: "మైనరు పంచాయితీబోర్డు యెన్నికలను న్యాయంగా జరుపుటకున్నూ, సదరుబోర్డులు ప్రజాసేవ ఇతోధికంగా చేయుటకున్నూ అవసరమైన సవరణల విషయమును గౌరవనీయులైన గవర్నరుగారు తమ ఉపన్యాసములో తీసుకురానందుకు విచారిస్తున్నాను."

The amendment was duly seconded.

Sri B. SANKARAYYA:—Sir, I move: Add the following at the end: [illegible] తమ ఉపన్యాసములో [illegible] బాధపడు [illegible] విస్తారాల గురించి తీసుకురానందుకు విచారి స్తున్నాను. [illegible]

[illegible] seconded. [illegible]

[illegible]

26th November 1953]

Sri B. SANKARAYYA:—Sir, I move: Add the following at the end: "గౌరవనీయులైన గవర్నరుగారు తమ ఉపన్యాసములో మద్యనిషేధమును రద్దుపరచ వలసిన అవసరాన్ని పేర్కొననందుకు విచారిస్తున్నాను."

The amendment was duly seconded.

Sri B. SANKARAYYA:—Sir, I move: Add the following at the end; "గౌరవనీయులగు గవర్నరుగారు తమ ఉపన్యాసములో తక్కువ జీతాలతో ఎక్కువ పని గంటలతో అవస్థపడే పోలీసు ఉద్యోగులకు సహాయపడవలసిన అవసరాన్నిగురించి పేర్కొననందుకు విచారిస్తున్నాను."

The amendment was duly seconded.

Sri B. SANKARAYYA:—Sir, I move: Add the following at the end: "సెంట్రలు పే కమిషన్ సిఫార్సులను ఆంధ్రలో ప్రభుత్వ ఉద్యోగులకు కార్మికులకు అనువర్తింపచేయవలసిన అవసరాన్ని గౌరవనీయులైన గవర్నరుగారు తమ ఉపన్యాసములో చెప్పనందుకు విచారిస్తున్నాను."

The amendment was duly seconded.

Mr. SPEAKER :—సవరణలు ప్రతిపాదించడం, బలపరచడం ఐనది. ఇప్పుడు ఒకొక్క సవరణను చర్చలోకి తీసుకుందాం. ఇప్పుడు నెంబరు 5 సవరణను ప్రతిపాదించిన శ్రీ నాగిరెడ్డిగారు మాట్లాడుతారు.

Sri Pillalamarri Venkateswarlu rose to speak.

Sri Y. V. KRISHNA RAO :—Point of Order —అమెండుమెంటు ఒకరి పేరుతో ఉన్నప్పుడు, ఇంకొకరు మాట్లాడవచ్చునా ?

Sri PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా ! గణాల్ని refer చేయవద్దన్నారు.

Mr. SPEAKER:—57 రూలు ప్రకారం propose చేసిన తరువాత discussion start చేసి ఏ మెంబరైనా మాట్లాడవచ్చుని యున్నది.

Sri PILLALAMARRI VENKATESWARLU:—[illegible] capital [illegible] ఉన్న అమెండుమెంటు [illegible]

Mr. SPEAKER:—Admit [illegible]

Sri PILLALAMARRI [illegible]

రాయలసీమకో వ్యతిరేకమని ఎవ్వరూ భావించరాదని విన్నవిస్తున్నాను. మొదటి నుంచీ గుంటూరు-విజయవాడ రాజధాని కావాలనీ కోరుతూవచ్చాం. ఏ కారణాలవల్ల కర్నూలులో ఉంటే యావదాంధ్ర ప్రజానీకానికీ వీలుగా ఉండదో సూచిస్తూవచ్చాం. ఈ రోజునకూడా ఆ కారణాలవల్లే, ఈ కర్నూలు పట్టణంలో రాజధాని ఉండకూడదనే తీర్మానాన్ని ప్రతిపాదించవలసిన అవసరం వచ్చింది. మరోవిషయం. విశ్వనాధంగారు ఇందాక మాట్లాడుతూ కర్నూలు రాజధానిని గురించి ఒక తడవ జూను 5 తేదీని తీర్మానం చేశాం, ఐపోయింది. మన ఇండియాప్రైమినిస్టరైన నెహ్రూగారంగీకరించారు. కాని వారొక విషయం మరచిపోయారు. మనరాజధాని విషయం మళ్ళీ మనం కూర్చుని చర్చించి నిర్ణయించుకోమన్నారనే విషయం విశ్వనాధంగారు బుద్ధిపూర్వకంగా మరచిపోయారనుకుంటున్నాను. ఆంధ్రా బిల్లు మదరాసులో చర్చించినపుడు టెంపొరరీ కేపిటల్ గా కర్నూలు ఉదహరింప బడింది. తరువాత మదరాసు ఎసెంబ్లీలో ఈ విషయం చర్చకు వచ్చినప్పుడు, మెజారిటీ సభ్యుల అభిప్రాయం దృష్టిలో పెట్టుకుని కేంద్ర ప్రభుత్వం టెంపొరరీ కేపిటల్ గా కర్నూలునే mention చేసిందని మనకు తెలుసును. అందువల్ల ఈ రోజున మనం తప్పనిసరిగా ఒక నిర్ణయం తీసుకోవలసిన అవసరం వచ్చింది. అంతే కాకుండా పార్లమెంటులో ఈ విషయం చర్చించిన సందర్భంలో హోముశాఖా మంత్రి కట్జూగారు, పండిట్ నెహ్రూ ఈ విషయం త్వరలో ఆంధ్ర ఎసెంబ్లీముందు చర్చకువస్తుందని, అప్పుడు capital ఎక్కడ ఉండాలో తేల్చుకోండని చెప్పారు. దురదృష్టవశాత్తు ఇక్కడ అధికారంలోయున్న ఒక పార్టీ—ఒకపార్టీ అనటకు వీలులేదు—ఎక్కువ పార్టీలు, లేక Cabinet లో యున్న ఎక్కువ మంది ఈ తీర్మానం చర్చకు రాకూడదనే అభిప్రాయం వెలిబుచ్చడం చాలా విచారకరమైన విషయం! ఎందుకంటే ఎంత కాలమని ఈ రాజధాని సమస్య పెండింగులో పెట్టుకుంటాము. ఎప్పుడో ఒకప్పుడు తేల్చుకోవలసిన విషయం అని మాత్రం మనం మరచిపోకూడదు. అందువల్ల ఈ తీర్మానం ఎంతత్వరలో తేల్చుకొని ఫైసలు చేసుకొని నిర్ణయించుకుంటే అంత మంచిది. లేక పోతే [illegible] చాలామంది [illegible] ఎవరికైనా స్థానికంగా అభిమానం ఉండవచ్చు. [illegible] కర్నూలు [illegible] ఉండవచ్చు. అదే [illegible] ప్రశాంతం పాటించవలసిన విషయం. [illegible] ప్రజానీకం [illegible]

[illegible]

కర్నూలు నిర్ణయాన్ని కమ్యూనిష్టుపార్టీ వ్యతిరేకించి తన పార్టీ తీర్మానం ప్రకారం విజయవాడ-గుంటూరు నిర్ణయానికే అనుకూలంగా వోటు చేసింది. తిరిగి రాజధాని సమస్య మద్రాసు శాసనసభలో ఆంధ్ర రాష్ట్ర బిల్లు చర్చకువచ్చిన సందర్భంలో తీసుకురాబడింది. ఆనాడు జరిగిన వోటింగులో తెనుగుశాసనసభ్యులలో 58 మంది మాత్రమే కర్నూలు నిర్ణయానికి అనుకూలంగా వోటు చేయడం, వ్యతిరేకంగా విజయవాడ - గుంటూరు నిర్ణయానికి అనుకూలంగా 63 వోట్లు రావడం, ఆ విధంగా ఆంధ్ర శాసనసభ్యులు విజయవాడ గుంటూరు నిర్ణయాన్ని సమర్థించడం, జరిగింది. ఆ నాడే మేము ప్రస్తుత గవర్నరుగారు, ఆ నాడు స్పెషలు ఆఫీసరుగావున్న త్రివేదిగారికి ఒక వుత్తరం వ్రాశాము. ప్రధానమంత్రి పండిట్ నెహ్రూకు కూడా ఒక ఉత్తరం వ్రాశాము. రాజధాని విషయంలో పునరాలోచన అవసరం అనీ, ప్రాంతీయ దురభిమానములను రెచ్చకొట్టకుండా ఈ విషయం సత్వరంగా తేల్చడం అవసరం కనుక ఒకటి రెండు రోజుల వ్యవధిలోనే ఆంధ్ర శాసనసభ్యులను తిరిగి సమావేశ పరచి రాజధాని విషయం final గా ఎక్కడ వుండాలి అనేది తేల్చుకోవాలని వ్రాసివున్నాము. మేము వ్రాసిన వుత్తరానికి గవర్నరుగారి దగ్గరనుంచి ఏమీ సమాధానం రాలేదు. ప్రధాన మంత్రి నెహ్రూ దగ్గరనుంచి మాత్రం జవాబు వచ్చింది. అందులో వారు ఏ మన్నారంటే ఈ రాజధాని విషయం తరువాత తేల్చుకో వచ్చునని, అప్పట్లో తిరిగి ఆంధ్ర శాసన సభ్యుల సమావేశం జరుపడానికి వ్యవధి లేదని. ఆ నాడే ఈ రాజధాని విషయం final గా తేల్చుకోడానికి కాంగ్రెసు పార్టీ ఒప్పుకొని వున్నట్లయితే, ఇంత డబ్బు ఖర్చుపెట్ట నవసరం లేకుండా ఈ సమస్యను పరిష్కారం చేసుకొని వుండేవారం. తిరిగి ఈ విషయం ఈ నాడు కర్నూల్లో చర్చకు రావలసి వచ్చిందంటే, దానికి బాధ్యత పూర్తిగా మెజారిటీ పార్టీ అయిన కాంగ్రెసుపార్టీ దే [illegible] వుంది. తాత్కాలికంగా రాజధానిని ఏర్పాటుచేసుకొని రాష్ట్రఅవతరణం [illegible] రాజధాని నిర్ణయం తిరిగి చేసుకోవలసిన అవసరం కలదు. కనుక [illegible] లోనుకాకుండా మనం ముఖ్యపట్టణాన్ని నిర్ణయం చేసుకోవలసిన అవసరం కలదు. [illegible]

[illegible]

మీద అభిమానం కాదు, పొలిటికల్ కాపిటల్ చేసుకొనే ఉద్దేశంతో అట్లాఅంటున్నారు. ఈ విధమైన రాజకీయ కారణాలవల్లగాని ప్రాంతీయ అభిమానాల వల్లగాని రాజధాని నిర్ణయం జరుగరాదని నేను మనవిచేస్తున్నాను. మేము చెప్పేది ఏమిటంటే, రాజధాని గుంటూరు - విజయవాడలో నెలకొల్పినట్లయితే ఎక్కువ expenditure లేకుండానే ఆ ప్రాంతంలో ఒక రకమైన permanent capital నిర్మించుకొని వుండేవాళ్లం. శాసన సభకు హాలు కావాలన్నా తేలిగ్గా ఏ దుర్గాకళామందిరంలోనో పెట్టుకునే అవకాశం వుంది. నూతనంగా సంపాదించుకున్న ఆంధ్రరాష్ట్రాన్ని బాగా అభివృద్ధిచేసుకొనిన తరువాత అవసరమైన పెద్ద బిల్డింగులు కట్టుకోవచ్చు, ప్రస్తుతం భవనాలకే ఎక్కువ డబ్బును వెచ్చిస్తే ముఖ్యమైన అభివృద్ధి ప్రణాళికలు వెనుకబడగలవు. అంతవరకు ఏదోవిధమైన భవనాల్లో కాలక్షేపం చేయవచ్చునని మేము అభిప్రాయ పడుతున్నాం. ఇక్కడ చూడండి, గవర్నరుగారి భవనానికే ఇంత వరకు రెండు లక్షల రూపాయలు ఖర్చుపెట్టినాము. ఇల్లా లక్షలకొలది రూపాయలు ఖర్చుచేయడానికి ఆంధ్ర రాష్ట్రానికి డబ్బు ఎక్కడ నుంచి వస్తుంది? కేంద్ర ప్రభుత్వం అన్నిప్రాజెక్టులకు డబ్బు ఇస్తుందనుకోడం పొరపాటని నేను మనవి చేస్తున్నాను. కేంద్రప్రభుత్వపు finances కూడా అంత ప్రోత్సాహకరంగా లేవని సంజీవరెడ్డిగారికి తెలియదా? ఈ పరిస్థితుల్లో ఈ నిర్ణయానికే సంజీవరెడ్డిగారు ఎందుకు అంటిపెట్టుకొని కూర్చోవాలి అని నేను అడుగుతున్నాను. దానివల్ల ఏమీ ప్రయోజనం లేదని మనవి చేస్తున్నాను. గతంలో చేసిన తప్పును సరిదిద్దకుండా అట్లే వుంచిన రెండు మూడు సంవత్సరాల పాటుగా చాలాచిక్కులు రాగలవని మనవి చేస్తున్నాను. రాజధాని గుంటూరు విజయవాడ ప్రాంతంలో పెట్టవలసిన అవసరాన్ని గురించి వేరుగా చెప్పనక్కరలేదను కుంటాను. ఆ ప్రాంతం అన్ని ప్రాంతాల వారికి కేంద్రంగావుంది. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ఆఫీసు అక్కడనే వున్నది. ఆ ప్రాంతం వివిధరాజకీయ పార్టీల కేంద్రం అయివున్నది. మనలో ఎన్ని అభిప్రాయభేదాలువున్నా శాశ్వతమైన రాజధాని నిర్ణయం చేసుకునేప్పుడు ఆంధ్ర జాతి, సంస్కృతి పెంపొందించ గల ప్రదేశాన్ని రాజధానిగా ఎన్నుకోవలసి వున్నది. అయితే విశాలాంధ్ర వస్తే హైద్రాబాదు రాజధాని అవుతుంది అంటున్నారు. విశాలాంధ్ర తప్పకుండా వస్తుంది; హైద్రాబాదు రాజధాని అవుతుంది. కొందరు రేపే వస్తుంది విశాలాంధ్ర అంటున్నారు. మంత్రి పట్టాభి రామారావుగారు రెండు, మూడు ఏళ్లలో విశాలాంధ్ర వస్తుంది అంటున్నారు.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:—నేను అట్లా చెప్పలేదు, సరిగానే చెప్పాను.

**Sri PILLALAMARRI VENKATESWARLU:**—Permanent capital గా కట్టాన్నా అనువైనది కాదని, పట్టాభి రామారావుగారు తమ అభిప్రాయం చెప్పే వున్నారు. ఎప్పుడో విశాలాంధ్ర వస్తుంది కనుక ప్రస్తుతానికి కట్టాన్నుల్లోనే వుందాం అనేది సరికాదని మనవిచేస్తున్నాను. విశాలాంధ్ర దృష్టిలో చూసినా, ఇక్కడ ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టడం [illegible] రాజధాని [illegible] అని మనవి చేస్తున్నాను. కేంద్ర ప్రభుత్వం ఎక్కువగా [illegible] [illegible]

చేసిన పెద్దలు ఈనాడు రేపో, మాపో విశాలాంధ్ర ఊడిపడుతుందని చెబుతున్నారు. హనుమంతరావుగారు ఈ విషయంలో మాట్లాడి వున్నారు. ప్రధాన మంత్రి పండిట్ నెహ్రూ విశాలాంధ్ర ఇస్తానని ఏమైనా చెప్పాడా? ఆయన విశాలాంధ్ర నినాదాన్ని కేవలం సామ్రాజ్యవాదతత్వంతో పోల్చిచెప్పినపుడు, విశాలాంధ్ర ఇంతత్వరగా వస్తుందని సంజీవరెడ్డిగారు ఎల్లా అనుకుంటున్నారో అర్థంకాకుండావుంది. ప్రధాన మంత్రి నెహ్రూగారు అల్లా చెబుతుంటే, సంజీవరెడ్డిగారు మట్టుకు చేయగలిగింది ఏమున్నది? ఏమీలేదు. ఈ పరిస్థితుల్లో మనం విశాలాంధ్ర సంపాదించడానికి బ్రహ్మాండమైన పోరాటం జరిపి ఆంధ్రరాష్ట్రంకొరకు పొట్టి శ్రీరాములుగారు ఆహుతి అయినట్టు ఇంక ఎంతోమంది పొట్టి శ్రీరాములులు అయినా ఆహుతి అవుటకు సిద్ధపడి విశాలాంధ్ర సంపాదించుకుంటాం. ఆంధ్రరాష్ట్రం పండిట్ నెహ్రూ ప్రసాదించిందికాదు. మనం సంపాదించుకున్నాం. అలాగే రేపు విశాలాంధ్ర సంపాదించుకుంటాం. ముఖ్యపట్టణం గుంటూరు విజయవాడ చేయడానికి అభ్యంతరం ఏమిటి? Technical గా అభ్యంతరం ఏమిటి? ఆఫీసులు తరలించడానికి time తీసుకోవచ్చు. దానికి April first '54 సరిపోతుంది అనుకున్నాం. అంతేకాని 55 April, 56 April వరకు ఉంచాలంటే చాలా ఇబ్బందులు ఉన్నాయన్న సంగతి మరచిపోకూడదు. ఎంత అనవసరపు ఖర్చు అవుతుందో గుర్తించాలి. Staff కు చాలినంత గుడారాలుగాని వసతులుగాని లేవు. వారీ యిబ్బందులను ఎంతకాలం పడాలి? ఎంతకాలం యీ పరిస్థితుల్ని కొనసాగించాలని చూస్తున్నారు? ప్రాంతీయ దురభిమానాల్ని రెచ్చగొట్టడం ఎందుకు అని ప్రశ్నిస్తున్నాను. కర్నూలులో రాజధాని పెట్టడంవల్ల కర్నూలుకుగాని రాయలసీమకుగాని ఒరిగిపోయేదేమీలేదు. రాయలసీమలో regional offices పెట్టడానికి అవకాశంఉన్నదా?

ఇకపోతే గవర్నరుగారి Addressలో అందరికీ ముఖ్యమైన High Court విషయం పేర్కొనకపోవడం అసంతృప్తికరంగావున్నది. గవర్నరుగారి Addressలో మధ్య తరగతి ప్రజానీకానికిగాని, రైతు కూలీలకుగాని సంబంధించిన సమస్యల ప్రసక్తి లేకపోవడం విచారకరం. ఆ సమస్యలు గురించి ఏమిచేయదలచారో తెలిసికోగోరుతున్నాను.

రాజధాని సమస్యను దేశక్షేమదృష్ట్యా, పరిపాలనాసౌలభ్యం దృష్ట్యా చూడాలిగాని రాజకీయదృష్ట్యా చూడ్డానికి వీలులేదు. ఆంధ్ర దేశపు నడిబొడ్డున వున్నటువంటి విజయవాడ-గుంటూరులో, వైజ్ఞానిక, రాజకీయకేంద్రం అయిన విజయవాడ-గుంటూరులో, రైలుకూడలిస్థలమైన విజయవాడ-గుంటూరులో, అన్ని సౌకర్యాలువున్న విజయవాడ-గుంటూరులో రాజధాని పెట్టడం మానేసి ఎక్కడో మారుమూలనున్న కర్నూలులో రాజధాని పెట్టి ప్రజలడబ్బు దుబారాచేయడం ఏమీ బాగులేదు. ఈ ప్రభుత్వ సిబ్బందిని ఎంతకాలం గుడారాలలో వుండమంటాము. సరైన సౌకర్యాలు లేనప్పుడు వారుమాత్రం ఏమి శ్రద్ధగా పనిచేయగలరు?

**DEPUTY SPEAKER** :— ఇంకా రెండు నిమిషాలు మాట్లాడండి.

Sri PILLALAMARRI VENKATESWARLU:—ఎలాగూ విశాలాంధ్ర వచ్చి హైదరాబాదులో శాశ్వత రాజధాని ఏర్పాటు చేసుకునేలోగా కొన్నికోట్ల రూపాయలు ఖర్చుపెట్టి కర్నూలులో రాజధానిని నెలకొల్పడంకంటే సిద్ధంగా buildings వున్న విజయవాడ - గుంటూరు ప్రాంతాల్లో రాజధాని నెలకొల్పడం దేశానికి లాభదాయకం అని విజ్ఞప్తి చేస్తున్నాను. ఆ డబ్బుతో ప్రాజెక్టులు నిర్మించుకోవచ్చునుగదా. తమ తప్పుడు నిర్ణయంను నిలబెట్టుకోడానికి ప్రాంతీయ దురభిమానాల్ని రెచ్చకొడుతున్నారు. రెండు సంవత్సరాల capital కోసం యింత డబ్బు వృధాచేయాలా? విజయవాడ కృష్ణానది దగ్గర వున్నందువల్ల అక్కడ రైతాంగం ధనవంతులై పట్టణాన్ని అభివృద్ధి చేశారు. ఒక్క దమ్మిడికూడా ఖర్చు చేయకుండా ఇప్పుడున్న భవనాలలో ప్రభుత్వ కార్యాలయాలన్నీ పెట్టవచ్చు. శ్రీబాగు ఒడంబడిక పేర ప్రాంతీయ దురభిమానాలను రెచ్చగొట్టవద్దని విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ పరిస్థితులన్నీ దీర్ఘంగా ఆలోచించి April 54 లోగా విజయవాడకు రాజధాని తరలించడం అవసరమని విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ లోగా మదరాసులో వున్న మన ఆఫీసులను విజయవాడప్రాంతానికి తరలించాలని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

* Sri K. KRISHNA RAO.—అధ్యక్షా! ఈ రోజు గవర్నరు ఉపన్యాసం మనం చూస్తాంటే East India Company రోజుల్లో గవర్నరుగారు

DEPUTY SPEAKER :—I am allowing only 15 minutes.

* Sri K. KRISHNA RAO:—ఆరోజుల్లో యిచ్చినటువంటి ఉపన్యాసంలాగుంది గాని ప్రజాతంత్ర ప్రభుత్వం వచ్చిన తరువాత ప్రజాప్రతినిధులతో ఏర్పడిన Cabinet తయారుచేసిన దానిలా లేదు. England దేశంలో Queen's Address లాగాని Soviet Union లో మలెంకోవ్ Address లా గాని లేదు. దానిలో ప్రజల స్థితి ఏ విధంగా వున్నదీ, వారి దుస్థితి తొలగించటానికి చేయబడిన ప్రయత్నాలు, వీటి ప్రసక్తే లేదు. Administrative details యివ్వబడ్డాయి గాని ప్రభుత్వం ప్రజానీకానికి ఏమి చేయదలచుకుందో యీ Address లో వివరించ బడలేదు. 4 సంవత్సరాలుగా రాయలసీమలోనే గాక నా నియోజక వర్గమైన నెల్లూరు జిల్లాలోకూడా వర్షంలేక పంటలు పండక రైతాంగం చాలా అవస్థలు పడుతున్నారు. దీని గురించి మీరు ఏమి చేయదలచారు? అటువంటి పరిస్థితుల నుండి రైతాంగం ఏ విధంగా బాగుపడాలి అనే విషయం ఏమీ కనుక్కోలేదు. కొన్ని ప్రాంతాలలో సంవత్సరానికి, మూడు పంటలు పెట్టడం; దానిలో రెండు పంటలు చెడిపోయి, పశువులచే ఆ పంటలు మేపించడం; మూడవ పంట సగం కావడం జరుగుతోంది. ఇక సాధారణంగా మెట్టప్రాంతాల్లో ఉండేటువంటి పరిస్థితులు ఎలా ఉన్నాయి అంటే, అక్కడ ఏ విధమైన పనులున్నాయి, ఎంత మందికిం [illegible], ఎంత మంది పని [illegible] పని

26th November 1953] [Sri K. Krishna Rao]

పాటలు లేకండా ఉంటే వాళ్లకుకూడా ఉండేటటువంటి సగటు ఆదాయం ఎంత, అని లెక్కలు తీసికోవాలి. సాధారణంగా కొన్నికొన్ని గ్రామాల్లో ఉన్న పరిస్థితులు చూస్తే ప్రజలు ఇప్పుడు ఎలా ఉన్నారు, పూర్వపురోజుల్లో ఎలా ఉన్నారనేది స్పష్టమవుతుంది. ఏ మంటే సాధారణంగా ఒక ఎకరం రెండెకరాలు ఉండేరైతు, ఒక ఎద్దు బండి తోలుకోడంవల్ల జీవితం గడుపుతుండేవాడు. ఈ వేళ బుల్డోజర్సు, ట్రాక్టర్సు, పంపుసెట్లు ఇవన్ని వచ్చిన తరవాత ఎన్నో గ్రామాల్లో ప్రజలకు రెండోవృత్తి లేకుండా పోయింది. అవన్నీ రావడంతో ఎద్దుబండ్లకు పనిలేకండా పోయింది. అసలే పనులు లేకండా ఉన్నవాళ్లమీద పంచాయతీ బోర్డులు పన్నులు వేస్తున్నాయి. ఈవిధంగా ఎంతో మందికి పని పాటలు లేకండా పోయి, వారు ఇతర గ్రామాలకు, ఇతర ప్రాంతాలకు వలస పోవడం జరుగు తున్నది, సాధారణంగా దక్షిణాది నుంచి కాళహస్తి మున్నగు ప్రాంతాల నుండి ఎక్కువ మంది, మా నెల్లూరుకు వలసరావడం అంతకుముందు వుండే కూలీ రేటుకన్న తక్కువ కూలీకి పోటీపడడం జరుగుతోంది. పూర్వం, గ్రామాల్లో బీద రైతులకు, వ్యవసాయ కూలీలకు, నాము యిచ్చే పద్ధతిని, పెద్ద రైతులు, ధాన్యం పనిలేని రోజులలో యిచ్చేవారు. కాని ధాన్యం ధరలు పెరగడంతో యీ పద్ధతి పోయింది. అందువల్ల పనిలేనిరోజులలో, బీదరైతులు, వ్యవసాయ కూలీలు, తిండిలేక, పస్తులు వుండాల్సిన పరిస్థితి యేర్పడింది. నాము యిచ్చేటువంటి పద్ధతి వుండేది అది ఇప్పుడు పూర్తిగా నశించింది. ఇప్పుడు అక్కడకుపోయి ఎవడినైనా అన్నం తిన్నావా అంటే అంతకుముందు మూడు రోజులనుంచి పస్తున్నానంటాడు. అందుచేత ఇప్పుడు గ్రామాల్లో ఉండే పరిస్థితి ఏమంటే అంతకు ముందు అన్నం తింటున్నటువంటివాళ్లు ఈ వేళ గంజి త్రాగడం జరుగుతున్నది. మన దేశంలో నూటికి 80 మంది గ్రామాల్లో నివసిస్తున్నారు. నేను చెప్పేది ఈ వేళ బ్రహ్మాండమైన నిరుద్యోగం ఏర్పడ్డంచేత బీదరైతులు సివాయి భూములు చేసుకోడం, చెరువు తట్టులు అవి ఆక్రమించుకొని వాళ్లు సేద్యం చేయడం జరుగుతున్నది. ఈ సందర్భంలో వాళ్లమీద విపరీతమైన పెనాలిటీలు వేయడం జరుగుతోంది. ఎందుకయ్యా ఈ పెనాలిటీలు ? 5 సంవత్సరాల నించి లేనటువంటి పెనాలిటీలు ఈ వేళ ఎందుకు వేయవలసి వచ్చింది ? ఈ వేళ ఏమి జరుగుతున్నది ? పెనాల్టీలు విపరీతంగా వేస్తున్నారు. ఎకరమునకు 50 రూపాయలు కొన్నిచోట్ల పెనాల్టీలు విధిస్తున్నారు. అరసెంటుకు 5 రూపాయలు కూడా వసూలు చేస్తున్నారు. సెంటైనా అరసెంటైనా సరే మినిమంగా, మనిషి వక్కంటికి, వసూలుచేయాల్సిన పెనాల్టీ, 5 రూపాయలంటారు. అసలే పనిపాటలు లేక తిండికి లేకుండా బాధపడుతున్నవాళ్లమీద ఈ పెనాలిటీలు, జరిమానాలు వేయడం ఒక శిక్షవేయడమే. ఇటువంటి శిక్షవిధించే అధికారం ఎవరికి ఇస్తున్నాం అంటే రెవెన్యూ ఆఫీసర్లకు. ఇట్టి శిక్షవేయడం అనేది ఎవరు వేయాలి ? ఎవరైనా శిక్షవేయాలంటే న్యాయాధికారి విచారణచేసి వేయాలికాని దేశంలో ఇతరులు వేయకూడదు. కనుక ఇప్పుడు ఈ అధికారాలు రెవిన్యూ అధికారుల చేతుల్లో ఉన్నవి. అంటే శిక్షవేసే అధికారం, వసూలుచేసే అధికారం, రెవెన్యూ అధికారం, యివంతా వారి

చేతులో వుంటూంది. కనుక ఇది ఒక బ్యూరోక్రటిక్ రాజ్యంగా ఏర్పడు తున్నదని నేను చెపుతున్నాను. గ్రామాల్లో ఈ విధంగా నిరుద్యోగ సమస్య అధికమౌతున్నప్పుడు ఎవరైనా అక్కడకుపోయి లెక్కలు అవి తీసుకుంటున్నారా? ఎంత మందికి పనులు ఉన్నాయి. ఎంత మందికి పనులు లేవు? ఈ విధంగా ఈ సమస్యను ప్రభుత్వం అరికట్ట ప్రయత్నిస్తున్నది అనే ఆర్థిక శాస్త్రవేత్తల కార్యక్రమం ఏమీ మనయొక్క గవర్నరు గారి Address లో లేకపోయింది. ఈ నాడు ప్రజలు, ఏ విధంగా నిరుద్యోగంతో బాధపడుతున్నారు అన్నది ప్రభుత్వం గ్రహించినట్టులేదు. ఉదాహరణకు విశాఖపట్నం జిల్లాలో మాంగనీసు గనుల ప్రాంతంలో పని నిలిచిపోయింది. పని ఉండేటటువంటి వాళ్లకు జీతాలు తగ్గిపోయాయి. తరువాత అలాగే మా జిల్లాలో మైకా పరిశ్రమ నిలిచి పోయి విపరీతమైన నిరుద్యోగం ఏర్పడింది. ఈ పరిస్థితి ఎందువల్ల వచ్చిందయ్యా అని అడిగితే, కొరియాయుద్ధం ఉన్నన్నాళ్లు సాధారణంగా విపరీతమైన ఎగుమతులు జరుగు తుండేవి. కొరియాయుద్ధం నిలిచిన తరువాత ఆ ఎగుమతులన్నీ నిలచిపోయాయి. దీనితో ఎంతోమందికి పనిపాటలు లేకండా పోయింది. అంతే కాకుండా అంతకుముందు లండ నుకు అక్కడకు ఎగుమతైన సరకుకు డబ్బు రానందున పెద్దపెద్ద లక్షాధికారులుకూడా ఈ వేళ దివాళా తీయవలసి వస్తున్నది. నిజం చెప్పితే ఈ విధంగా ఆంధ్రదేశంలో ఎన్నో చిన్నచిన్న పరిశ్రమలలో ఎంతోమందిని పనిలోనించి తీసివేయడం జరుగుతున్నది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరవాత ప్రభుత్వమే, అక్టోబరు నుంచి ఎంతో మందిని ఉద్యోగాల నుంచి తీసివేశారు. కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలలో అక్కడ ఎలెక్ట్రిసిటీ ఎక్స్‌టెన్‌షన్‌ను నిలిపివేశారు. అందువల్లకూడా ఎంతోమంది నిరుద్యోగులైనారు. ఈ రోజువరకు తిరిగి వాళ్లకు మళ్లా పనిపాటలు కల్పించటం అనేది ఎవరూ ఎత్తుకోలేదు. ఈ విషయంలో యీ నిరుద్యోగులు కలెక్టర్ల దగ్గరకు ఇతర ఆఫీసర్ల దగ్గరకు రాయబారాలు తీసుకువెడితే, దాంతోటి ఇదంతా కమ్యూనిష్టులు చేస్తున్న గలభాలే అని ఆ వెళ్లిన ఎంతోమందిని అరెస్టు చెయ్యడానికి వాళ్లమీద చర్యతీసికోడం జరుగుతున్నది. దానిమీద క్రిమినల్ కేసులు పెట్టటం జరుగుతూంది. యీ విధంగా, నెల్లూరు, అనంతపురం జిల్లాలలో జరుగుతూంది. ప్రజలు బాగుంటేనే ప్రభుత్వం, మంత్రులు, శాసన సభ్యులు, వీటి కొక అర్థముంటుంది. వాళ్లందరూ సుభిక్షంగాఉంటేనే మనమంతా వుండటంలో సార్థకముంటుంది. కనుక వాళ్లకు పనిపాటలు, తిండికల్పించేభారం మనమీదఉంది. కాని ఇప్పుడుండేటటువంటి పరిస్థితులలో దీన్నిగురించి ప్రభుత్వం ఏ విధమైనటువంటి చర్యలుకూడా తీసికోడం లేదు. ఒక నూతన మైనటువంటి రాష్ట్రం వచ్చింది. యింతకుముందు, మద్రాసు రాష్ట్రం వుండగా, ఆంధ్ర దేశంయొక్క ప్రత్యేక ఆర్థిక సమస్యలగూర్చి, సాంఘిక పరిస్థితులగూర్చి వక Integrated outlook లేకుండావుండి వుండవచ్చు. కాని, రాష్ట్రం ప్రత్యేకంగా ఏర్పడినతర్వాత, యీ విషయాలగూర్చి, మన ఆర్థిక మంత్రి చూచివుండాల్సింది. దాన్నిగూర్చి ఒక పరిష్కార మార్గం సూచించి వుండాల్సింది. కాబట్టి ఇప్పుడు మన ప్రధాన సమస్యయినటువంటి ఈ

నిరుద్యోగ సమస్య ఏ విధంగా పరిష్కారం అవాలి అనేటువంటి పాయింట్ ప్రజలకు గవర్నరుగారు తెలపడానికి వీలు లేదా అని నేను అడుగుతున్నాను.

Sri B. KRISHNAMURTHY RAO:—అధ్యక్షా! చేరిన 140 మంది శాసన సభ్యులు భారతదేశానికి చరిత్రకారులుగా వ్యవహరించే అవకాశం లభించింది. చరిత్రను కళంక భూయిష్టంకాకుండా చేసుకోవడం 140 మంది శాసనసభ్యులమీద ఆధారపడి వుంది. మనకు 1947 సంవత్సరంలో స్వాతంత్ర్యం వచ్చినది. భారతదేశంలో అనేకసంవత్సరాలుగావున్న భాషారాష్ట్ర సిద్ధాంత ఆశయంలో ఒక అడుగు ముందుకువేయడానికి ఒక మహత్తరమైన అవకాశం ఆంధ్రజాతికే లభించింది. 5 సంవత్సరాలుగా కాంగ్రెస్ పక్షం దేశంలో అధికారం వహించియున్నది. ఈ నాడు గవర్నర్ గారి ప్రసంగంపై చర్చిస్తూ కమ్యూనిస్టు పక్షసభ్యులు, ప్రభుత్వపక్షాన్ని విమర్శిస్తున్నారు. వారిది శాసనసభలో బలముగల పక్షమనియు, వారిది కాంగ్రెస్ పార్టీ కంటె బలతరమైన పక్షమనియు, వారిచేతిలో అధికారం పెట్టి ప్రభుత్వాన్ని ఏర్పరచమనడం న్యాయమనియు వారు గవర్నరుగారిని విమర్శిస్తున్నారు. వారు మన రాజ్యాంగాన్నికూడా విమర్శిస్తున్నారు. 1947 వ సంవత్సరం ఆగష్టు 14 వ తేదీన మనరాజ్యాంగ చట్టం తయారుచేయబడింది. ఆరాజ్యాంగ చట్టం ప్రకారం దేశంలో ప్రజాస్వామికాన్ని చిరస్థాయిగా దేశంలో స్థాపించడానికి కాంగ్రెస్ పక్షం కృషిచేస్తోంది. ఈ రాజ్యాంగ చట్టం ప్రకారమే బ్రహ్మాండమైన ఎన్నికలు జరిపించారు. ఆ ఎన్నికలలో దురదృష్టవశాత్తూ ప్రజాస్వామిక పక్షాలలో చీలికలువచ్చి కొన్ని వర్గాలుగా చీలిపోవడంవల్ల కమ్యూనిస్టులు ఎక్కువమంది రాగలిగారు. ఉదాహరణకు నా నియోజక వర్గానికి సమీపంలోని ఒక నియోజకవర్గంలో అభ్యర్థులు 8 మంది నిలబడితే, మొత్తం 46 వేల ఓట్లు పోలైతే 9 వేల ఓట్లు వచ్చిన కమ్యూనిస్టు అభ్యర్థి గెలిచాడు. అనగా దీనిని బట్టి చూడగా ప్రజాస్వామిక పక్షాలవారు మిగిలిన 7 గురు 37 వేల ఓట్లను పంచుకోనడం వల్ల 9 వేల చిల్లర ఓట్లతోనే కమ్యూనిస్టు అభ్యర్థి గెలుపొందాడు. అంటే ప్రజానీకంలో చాలామంది కమ్యూనిస్టులకు వ్యతిరేకు లన్నమాట. కమ్యూనిస్టు సిద్ధాంతం ప్రజాస్వామికానికే విరుద్ధమైనది. ప్రజాస్వామిక పక్షాలన్నీకలసివచ్చి కమ్యూనిస్టు పక్షాన్ని ఎదుర్కొంటాయి. కాంగ్రెస్ పక్షం ఎప్పుడూ ప్రజాస్వామికాన్ని నెలకొల్పి ప్రజలలో శాంతిని నెలకొల్పడానికి పాటుపడుతుంది. ఇంతకు ముందు మిత్రుడు నాగభూషణంగారు వారి సిద్ధాంతాలనుగురించి మాట్లాడుతుంటే కమ్యూనిస్టు పార్టీవారంతా వ్యతిరేకించారు. వారి సిద్ధాంతాల ప్రకారం, రష్యాలో కమ్యూనిస్టు పార్టీని ధిక్కరించిన వ్యతిరేక పక్షానికి తావులేదని నేను చెప్తున్నాను. కావాలంటే చదువు చున్నాను నా మిత్రులంతా గోలచేయకుండా సమగ్రంగా వినాలి—

[సభలోనుంచి ఎవరో:—ఏ పుస్తకమండీ అది?]

ఇది, A to Z Russia by A. FREUND.

The right of nominating candidates belongs to the Communist party organisations, to the Trade Unions, to the co-operatives, to organisations of youth and to other legally registered organisations of the workers, i. e., to organisations under strict party control. The nomination of candidates takes place in open meetings. Each nominee has to pass an electoral commission before becoming a candidate. For each constituency one candidate is appointed. The nomination of an alternative candidate is not forbidden, but it is not practised. Thus the election turns entirely upon the right of nomination."

(Disturbance from the Opposition)

ఉపాధ్యక్షులవారికి ఒక విన్నపము; శాసనసభా మర్యాదలకు విరుద్ధంగా ఒక సభ్యుడు మాట్లాడుతుంటే మరొక సభ్యుడు లేచి ఎదురు చెప్పవచ్చునా? ప్రతిపక్షంలోని సభ్యులు నేను ప్రసంగించుచుండగా అలా ఎదురు చెపుతూ నా ప్రసంగానికి అడ్డు రావచ్చునా? నేను శాసనసభ్యుడను కానా? నాకు శాసనసభలో ప్రసంగించే హక్కు లేదా? నేను శాసనసభ్యుడను కాదని, నన్ను బయటకు వెళ్లమంటే వెళ్లుతాను.— అందుచేత మరల అడ్డువచ్చి మాట్లాడినపుడు సక్రమమైన రూలింగ్ యివ్వాలని కోరుచున్నాను.—

DEPUTY SPEAKER :—సభా మర్యాదలను పురస్కరించుకొని సభ్యులు సభా కార్యక్రమానికి అడ్డురాకుండా నిశ్శబ్దంగా వుండాలని సభ్యులకు మరొకసారి మనవిచేస్తున్నాను.

Sri K. RAJAGOPALA RAO:—ఒకరు మాట్లాడుతుంటే ఇంకొకరు మాట్లాడి వినోదం నవ్వు కల్గచేయడం వుంటేనే సభలో జీవం గాని, కళ గాని వుంటుంది. ఇది ప్రతి శాసన సభలోను, ప్రతి పార్లమెంట్‌లోను మామూలుగానే వుంటుంది.

DEPUTY SPEAKER:—అది సభా కార్యక్రమానికి ఆటంకంగా మాత్రం వుండకూడదు.

Sri B. KRISHNAMURTHY RAO:—ఉపాధ్యక్షా, నూతనముగా స్థాపింపబడిన ఈ ప్రభుత్వము ఇంకను స్థిరపడలేదు అనే విషయము ప్రతిపక్షసభ్యులకుకూడ తెలుసును. అది తెలిసికూడ, ఈనాడు చాలా విపరీతముగా విమర్శించడంలో, వారి నిగూఢమైన అభిప్రాయమేమిటి అని ఆలోచిస్తే, మేముకూడ విమర్శించినాము. విమర్శించేటటువంటి కర్తవ్యం మాది. మాకుకూడా ఆనేటటువంటి విధానములో వచ్చినటువంటి విమర్శలే ఇవి గాని, ఒక బ్రహ్మాండమైన రాజకీయ [illegible] వ్యవహరించేవి కావని నా అభిప్రాయము. ఒక విషయము మాత్రము ఈ నాడు వారందరికి చాలా చిక్కుగా కనిపించు

చుండవచ్చు. ఇదివరకు ప్రతిపక్షములో నాయకులుగా ఉంటున్నటువంటి వారు, కొంత వరకు గురువులుగా వుండవలసినటువంటివారు, ఆర్థికశాస్త్రములోను, తదితర శాస్త్రముల లోను ప్రవీణులైనటువంటివారు అగు విశ్వనాధంగారు నేడు తమకు అండగా లేక ప్రభుత్వ పక్షంలో చేరారు అనే ఆవేదనచేత వారిని విమర్శించుటకు పూనుకొన్నారు. రాజగోపాలాచారిగారి ప్రభుత్వములో విశ్వనాధంగారి నాయకత్వాన చాలాకాలము జయప్రదముగా తమ పక్షమున కార్యక్రమాలను నిర్వహించుకొంటూ ఉండినటువంటివారికి ఈ నాడు ఆ అవకాశము లేకపోయెననే ఆవేదనచే వారిని విమర్శిస్తున్నారేగాని రాజ కీయ జ్ఞానం తెలియకకాదు. ముఖ్యంగా, ఉదయము మాట్లాడిన మిత్రులు ఇప్పుడు మాట్లాడిన మిత్రులు, హఠాత్తుగా ఎవరికి తెలియకుండా కర్నూలు ముఖ్యపట్టణముగా వచ్చిందని అన్నారు. బహుశా, వారు రాష్ట్రపోరాటం కోసం జరిగినటువంటి చరిత్రను మరచిపోయారేమో అనే సందేహము కలుగుచున్నది. అది సందేహంకూడా కాదు. గత చరిత్రను మరిచిపోయారనే చెప్పవచ్చును. రాష్ట్రంరావడానికి ముందు, అది మంచికి గానో, చెడుపునకుగానో ఎవరు కల్పించారోగాని, రాయలసీమవారికి, కోస్తావారికి విభే దాలు కల్పించారు. ఆ విభేదాలు సమసిపోయి, అందరు ఐకమత్యంగా రాష్ట్రంకొరకు పోరాడే నిమిత్తం, పెద్దలందరు కలిసి, శ్రీబాగు ఒడంబడిక అనేదాన్ని ఏర్పాటుచేసి, అందులో రాయలసీమవారికి హైకోర్టో, లేక రాజధానో, ఏదికోరితే అది ఇస్తామని చెప్పడం జరిగింది. అప్పటికి కర్నూలు ముఖ్యపట్టణం కావలెనని ఎవరు అనుకొని యుండక పోవచ్చును గాని, అయితే ఆ ఒడంబడిక ననుసరించే ఈ కర్నూలు నిర్ణయం జరిగింది. ఆ ఒడంబడిక ననుసరించి కాంగ్రెసు పెద్దలు, రాజకీయ పెద్దనాయకులందరుకూడా రాయలసీమవారికి రాజధాని ఇచ్చేందుకు అంగీకరించారు అనే విషయము అందరికి తెలుసును. అయితే ఈ రాజధాని నగరమును నిశ్చయించేటప్పుడు, అది కర్నూలులోనా, తిరుపతిలోనా అనేవిషయము వచ్చింది. అప్పుడు అనంతపురము పేరు రాలేదు. ప్రతి పక్షమువారు మాత్రము మొట్టమొదట నుంచి గుంటూరు, విజయవాడ అంటూ వారి వ్యవహారము వారు చేసుకొంటున్నారు. అయితే మిగతా అన్ని పార్టీలవారు రాయల సీమలో రాజధాని ఉండవలసిందనే నిర్ణయాన్ని బలపరిచారు. ఆ విధంగా ఈ తాత్కాలిక మైనటువంటి రాజధానిని నిర్ణయించారు. ఇది తాత్కాలికమైనటువంటి ఏర్పాటేనని ఈ నాటికిని చెప్పుతున్నారు. ఆ ఉద్దేశంతోనే ఇక్కడ రాజధానిని ఏర్పాటుచేశారే గాని, కోస్తా జిల్లాలవారిని మోసముచేసి, కావలసినంత డబ్బు ఇక్కడ ఖర్చుపెట్టి రేపు ఇక్కడి నుండి కదలటానికి వీలులేదు అని చెప్పే ఉద్దేశ్యం ఎవరికీగూడ లేదని చెప్తు న్నాను. మనము ఆంధ్ర ప్రాంతములోని ఒక భాగము మాత్రమే, అనగా 11 జిల్లాలు, 3 తాలూకాలను మాత్రమే ఈనాడు సంపాదించుకొన్నాము. ఇంక సంపాదించుకొనవలసిన భాగము ఎక్కువ ఉన్నది. ఆ దృక్పథముతోనే మన ముందు కార్యక్రమాన్ని కొనసాగించ వలసియున్నది. స్వామి రామానందతీర్థగారు గూడ హైదరాబాదు విషయంలో అది ఆంధ్రులకే చెందవలసినదని, దానిపై ఆంధ్రులకే హక్కున్నదని, కన్నడిగులకు గాని

లేక మహారాష్ట్రులకుగాని అది ఎంతమాత్రము చెందదని ఉద్ఘాటించారు. అందుచేతనే, ఆ హైదరాబాదును ముఖ్యపట్టణంగా విశాలాంధ్రను నిర్మించుకోనే ఉద్దేశ్యంతోనే ఒక రాజకీయ పితామహుడు అయినటువంటియు, అన్ని పార్టీలవారికి పెద్ద అయినటువంటియు, ఆంధ్రకేసరియగు ప్రకాశం పంతులుగారు ఆనాడు కర్నూలు నిర్ణయాన్ని తీసుకొనివచ్చి ఆ విధముగా దీనిని ఏర్పాటుచేశారు. ఈ నిర్ణయం చేయడంలో, వారు కోస్తా జిల్లాలపైన ఏలాటి నిరసనతోగాని, లేక రాయలసీమవారిపైన ఒక ప్రత్యేక మైనటువంటి భ్రమతోగాని చేయలేదు. ఈ నాడు దీనికొరకు దాదాపు 50 లక్షల రూపాయలు ఖర్చుపెట్టారు. ఈ మొత్తం సక్రమంగా ఖర్చుపెట్టారా అన్నట్లయితే, ఎదో కొంత కంట్రాక్టర్లు తినివేసివుంటేచెప్పలేనుగాని, మొత్తంమీద సక్రమంగానే, ప్రభుత్వ అవసరాలకే ఖర్చుపెట్టారని అనక తప్పదు. కనుక మనము ఈ రాష్ట్రాన్ని స్థిర పరచుకొని, ఇకముందు విశాలాంధ్రను సాధించడానికే మన దృష్టి అంతయు కేంద్రీకరింప వలసియున్నది. విశాలాంధ్రకే మనమందరము దోహద మీయవలసి యున్నది. ఆ విశా లాంధ్రను ఏర్పరచుకొనేంతవరకు ఈ తాత్కాలిక రాజధాని నిమిత్తం మితముగా కొంత డబ్బుకు మించకుండా ఖర్చుపెట్టవలసిందనే నిర్ణయమునకు వచ్చి ఆ విధముగా నడచు కొన్నట్లైతే, సక్రమంగా, సుభిక్షంగా, మనయొక్క ఉద్దేశాన్ని నెరవేర్చగలుగుతామని మనవిచేస్తున్నాను.

DEPUTY SPEAKER:—నేటికి ఇంతటితో ఈ సభాకార్యక్రమం ముగిసింది. మరల రేపు 10 గంటలకు సమావేశమౌదాం.

The House then adjourned to meet again at ten of the clock on Friday, the 27th November 1953.